C

# కృష్ణాజిల్లా

# గ్రామదేవతలు



కృష్ణాజిల్లా
న్యూ మాన్యువల్ కమిటీ

సమర్పణ

2

**KRISHNA ZILLA GRAMA DEVATALU**

**కృష్ణాజిల్లా గ్రామదేవతలు**

Editor

**Sri K. Prabhakara Reddy,** IAS

Asst. Editors

**Sri Lanka Venkata Ramana**

**Dr. G.V. Purnachand**



Rs. 50/-

1st Edition

Sept, 2005

Printed at : Vinayak offset Printers, Vijayawada-2

Published by :

**The Krishna District New Manual Comittee**

# OUR TEAM

**Chairman:**
**Sri K. PRABHAKARA REDDY**, IAS
Former Collector, Krishna Dist (2003-2005)
Adl. Secretary to
Andhrapradesh Chief Minister
Editor of the New Manual

**Assistant Editors:**
Sri Lanka Venkata Ramana
Dr. G.V. Purnachand.

**Editorial Board:**
Sri Nanduri Rama Mohana Rao
Sri C. Raghavachari
Padmasri Turlapati Kutumba Rao
Sri V.R. Bomma Reddy
Sri Veeraji
Sri Andavilli Satyanarayana
Sri A. Satyanarayana
Sri Krishnaji

**Managing Committee:**
Sri Dasari Ramakrishna
Sri Parvathaneni Shanti Kishore
Sri Immadisetty Rama Kumar
Sri Seeram Rama Rao
Sri Chalasani Ajay Kumar
Sri E. Gopala Krishna Reddy

**Consultant:**
Prof. A. Anuradha

**Co-ordinators:**
Sri Ch. Purnachandra Rao
Sri A. Abja Rao

**Advisory Committee:**
Sri M. Narayana Prasad
Sri Ashok
Sri Babji
Sri R. Rama Swamy
Sri Guttikonda Subba Rao
Sri Mandava Sree Rama Murty
Sri Maganti Subrahmanyam

6

# శ్రీ దుర్గా మల్లేశ్వర స్వామివార్ల దేవస్థానం

## ఇంద్రకీలాద్రి- విజయవాడ







**శ్రీ చక్రనవావరణార్చన శ్రీ చక్రరాజనిలయా**
**శ్రీమత్త్రిపురసుందరీ! శ్రీ శివా శివశక్త్యైక్య స్వరూపిణీ లలితాంబికా**

అని లలితా సహస్రనామ స్తోత్రంలో చెప్పినట్లుగా, సృష్టి స్థితి లయకారిణియైన ఆదిశక్తి మన దుర్గమ్మ పవిత్రమైన ఈ ఇంద్రకీలాద్రిమీద లలితా స్వరూపిణిగా ఆ తల్లి నిత్యం పూజలందుకుంటూ ఉంది. అత్యంత మహిమోపేతమైన శ్రీచక్రంలో నిత్యం ఆ తల్లి కొలువుతీరి వుంటుంది. అందుకే శ్రీచక్రాన్ని అర్చిస్తే ఆ తల్లిని అర్చించినట్లే అని పెద్దలంటారు.

శ్రీ దుర్గామల్లేశ్వరస్వామివార్ల దేవస్థానంలో ప్రత్యేకంగా భక్తుల సౌకర్యార్థం శ్రీచక్రనవారణార్చనలో భక్తులు ఎవరైనా పాల్గొనవచ్చు. అలాగే రూ. 6000/- ఒకేసారి చెల్లించినట్లయితే భక్తుల గోత్రనామాలతో ప్రతి సంవత్సరం వారు కోరిన రోజున శాశ్వతంగా ఈ నవవరణార్చన జరిపించబడుతుంది. కావున భక్తులందరూ ఈ అర్చనా కార్యక్రమంలో పాల్గొని తరించవలసిందిగా కోరుతున్నాము.

**పూజా రుసుము: రూ. 516/- (దంపతులకు)**

గమనిక: పూజా ద్రవ్యములన్నీ దేవస్థానంవారే ఏర్పాటు చేస్తారు. పూజానంతరం దంపతులకు అమ్మవారి అంతరాలయ, ఉపాలయాల్లో ఉచిత దర్శన సౌకర్యం కల్పించటమైనది.

**అంకెం ప్రభాకరరావు**
అధ్యక్షులు, ధర్మకర్తల మండలి

**ఇ. గోపాలకృష్ణారెడ్డి** B.Sc., L.L.M.
కార్యనిర్వహణాధికారి & రీజనల్ జాయింట్ కమీషనర్



పరమహంస, పరివ్రాజకాచార్య, జగద్గురు
**శ్రీ సిద్ధేశ్వరానంద భారతీస్వామి**
సిద్ధేశ్వరీ పీఠాధిపతి- కుర్తాళం

వినాయక చవితి
ది. 7-9-2005

# ఆశీర్వాద శ్రీముఖము

ప్రాచీన భారతీయ వాఙ్మయంలొ దెవతలను గుర్చి బహువిధములైన విశేషాలు గోచరిస్తవి. దివ్య లోకాలలోని దేవతలు కొందరు. వారి పేర్లతో భూలోకంలో చరిత్ర నిర్మించిన దేవతలు కొందరు. దివి నుండి దిగి వచ్చినదేవతలు కొందరైతే భువి మీద పుట్టి దివికెక్కిన వారు కొందరు. త్యాగమూర్తులు, సాహసవంతులు తమ ప్రాణ సమర్పణ ఫలితంగా దేవతలై ప్రజలచే పూజలందుకోటం, ఆరాధించబడటం ఈ దేశంలోనే కాదు ఏ దేశంలోనైనా సహజం.

గ్రామీణ దేవతలు భారత దేశంలోని అన్ని ప్రాంతాలలోను ఉన్నారు. అర్చనలందుకొంటున్నారు. ఆశ్రితుల కోరికలు తీరుస్తున్నారు. పరమేశ్వరి అనుగ్రహంచేత అటువంటి కొందరితో మాట్లాడే అదృష్టం నాకు లభించింది. సిద్ధయోగులు కొందరు ఇటువంటి తమ అనుభవాలను దర్శనాలను నాకు తెలియజేశారు. దివ్య భూమికలలో ఇట్టి విశేషాలను సాధకులు తమ జపధ్యాన మార్గముల ద్వారా తెలుసుకొని సత్ఫలితాలు పొందవచ్చు.

ఈ గ్రామ దేవతల చరిత్రను పరిశోధించి ఇంతకు ముందు కొందరు తమ గ్రంథాలలో తెలిపారు. విశ్వ విద్యాలయాలలో యమ్‌ఫిల్, పిహెచ్‌డి స్థాయిలో కొంత సమ్యక్ శోధన జరిగింది. ఇటువంటి ఒక పరిశోధన నిబంధనకు పూర్వాశ్రమంలో న్యాయ నిర్ణేతగా వ్యవహరించిన సంగతి గుర్తుకు వచ్చింది. ఇప్పుడు ఈ గ్రంథ రచయితలు కృష్ణాజిల్లా గ్రామ దేవతలను గూర్చి చేసిన

ఉదాహరణగా చెప్పాలంటే తమని పోషించే దేవిని పోచమ్మ అని కొన్ని గ్రామాలలో పిలుచుకొంటారు. ఈమెని కాళికాదేవి రూపంలో ఆరాధించుకొంటారు. స్ఫోటకం, పొంగు లాంటి అంటువ్యాధులకు పోచమ్మ అధిదేవత అంటారు. స్ఫోటకం పోస్తే పోచమ్మ పోసిందనీ లేక అమ్మతల్లి - ఆటపాటలమ్మ - తట్టుతల్లి - మహమ్మారి సోకిందనీ భావించి ఆ సమయంలో ఆమెను చల్లబర్చడంకోసం చద్ది సమర్పించుకొంటారు. ఊరు జనమంతా ఈ వ్యాధి ప్రబలినప్పుడు జాతరలు చేసుకొని అమ్మవారిని తృప్తి పరచుకొంటారు.

అలాగే "మైసమ్మ" పశువుల దేవత. మహాలక్ష్మి, మహిషమ్మ అనే పదమే గ్రామీణుల నోట మైసమ్మగా మారింది. పశువులు తప్పిపోయినప్పుడు, వ్యాధులు సోకి మరణిస్తున్నప్పుడు మైసమ్మకు మొక్కుకొంటారు. అందుకే గేదెమహాలక్ష్మి అని కూడా అంటారు.

జానపదులు కట్టమైసమ్మ పండుగ జరుపుకొనే సందర్భంలో ఆమెను స్తుతిస్తూ, కోరికలు తీర్చమని అర్థిస్తూ పాడుకొనే గేయం.

"అమ్మా తల్లీ మైసమ్మా, నిను నమ్మితిమి మాయమ్మా
శరణేడితిమీ ముద్దులగుమ్మా, నీ దాసులాము మము గనవమ్మా
నీ శత్రులాను దురుముమమ్మా, నీకు తెత్తురు బోనాలట
నీకు తిరిగేటి బండ్లది బాటా, కల్లు కడవలు కొబ్బరికాయలు
నమ్మి తెచ్చెదము నాదంబులతో, సమ్మతి తోడను నీ గుడిలోపల
ఇక పువ్వులతో పూజలు చేతుము, అమ్మా దయతలచు తల్లీ మైసమ్మా.

1961 సెన్సస్ ఆఫ్ ఇండియా రెండవ వాల్యూమ్ ఫెయిర్స్ అండ్ ఫెస్టివల్స్‌లో కృష్ణా జిల్లాలోని దాదాపు 160 గ్రామాల చారిత్రక ప్రాధాన్యతలు, అక్కడి పండుగలు, ఉత్సవాల గురించిన వివరాలు వున్నాయి. ఈ వివరాల్ని పరిశీలించినప్పుడు కనీసం 47 మంది గ్రామదేవతలున్నట్టు తేలింది. ఈ 47 మంది గ్రామదేవతలకు ఏదో ఒక స్థాయిలో పండుగలు గానీ, ఉత్సవాలుగానీ, జాతరలుగానీ, తిరుణాళ్ళుగానీ జరుగుతున్నాయి.

కృష్ణాజిల్లాలో 50 మండలాలున్నాయి. 991కి పైగా గ్రామాలున్నాయి.

ఈ గ్రామాలన్నింటినీ మరింత విపులంగా పరిశీలిస్తే గ్రామదేవతల సంఖ్య 47కు మించే అవకాశం వుంది.

1) అంకమ్మ పేరంటాలు, 2) అచ్చమ్మ - పాపయ్య, 3) అచ్చమ్మ వాసిరెడ్డి, 4) అలివేలమ్మ, 5) అద్దంకి నాంచారమ్మ, 6) ఇరుమలమ్మ, 7) కోటమహిషమ్మ, 8) కొండమారెమ్మ (వానదేవత), 9) కుంతిదేవి (గొంతేలమ్మ), 10) గోగులమ్మ, 11) గంటాలమ్మ, 12) గంగానమ్మ, 13) చంద్రమ్మ, 14) తుంగ పల్లెమ్మ, 15) తిరుపతమ్మ గోపయ్య, 16) తుమ్మలమ్మ, 17) నాంచారమ్మ, 18) నూకాలమ్మ, 19) నీరమ్మ, 20) పెద్దమ్మ, 21) పోలేరమ్మ, 22) పుట్లమ్మ, 23) పెద్దింటమ్మ, 24) పల్లాలమ్మ, 25) బుచ్చమ్మ, 26) బతకమ్మ, 27) మద్దిరామమ్మ, 28) మావుళ్ళమ్మ, 29) మారెమ్మ, 30)మాలచ్చమ్మ, 31) ముత్యాలమ్మ, 32) ముక్కొల్లు మహాకాళమ్మ, 33) పెనమకూరు మంగమ్మ, 34) ముప్పాళమ్మ, 35) యల్లమ్మదేవత, 36) రంగమ్మ పేరంటాలు, 37) లంకమ్మ, 38) వీరమ్మ పేరంటాలు, 39) వాకాలమ్మ, 40) వేలమ్మ, 41) శ్రీలక్ష్మీ పేరంటాలమ్మ, 42) సరోజనమ్మ, 43) బాలసన్యాసమ్మ, 44) చల్లలమ్మ, 45) యాపారమ్మ, 46) మామిళ్ళమ్మ, 47) ఎల్లారమ్మ. వీరందరి కథలు పరిశీలించినప్పుడు ఈ దేవతలు ఆరు వర్గాలుగా కన్పిస్తారు. వీళ్ళల్లో ప్రాణత్యాగం చేసి దేవతలైన పేరంటాలమ్మలున్నారు. బలవన్మరణానికి బలి అయిన వారు వున్నారు. వివిధ కులాలకు చెందిన దేవతలు కన్పిస్తారు. ప్రకృతిమూర్తులే మానవ రూపంలో దేవతలుగా ఆరాధనలు పొందుతున్నవారూ, పురాణాలలో ప్రసిద్ధి చెందిన కొన్ని పాత్రలు కూడా కృష్ణాజిల్లాలో దేవతలుగా పూజలందుకొంటున్నవారున్నారు. అలాగే మంత్రాలతో పూజలందుకొంటున్న తాంత్రిక దేవతలూ ఉన్నారు.

**1. ప్రాణత్యాగం చేసినవాళ్ళు :** కృష్ణాజిల్లా గ్రామదేవతల్లో వివిధ కారణాల వలన ప్రాణత్యాగం చేసిన వ్యక్తులే ఎక్కువగా కన్పిస్తారు. సతీసహగమనం కారణంగానో, అత్యాచారం కారణంగానో, నిరాశతోనో ప్రాణత్యాగం చేసుకొన్నవారుంటారు. అలాంటివారిలో కొందరు దేవతలుగా

గ్రామదేవతలు పూర్వీకులనేది ఇక్కడ ముఖ్యవిషయం. ఈ గ్రామ దేవతల్ని సప్తమాతృకల అంశలుగా భావిస్తారు.

**"బ్రాహ్మీ మాహేశ్వరీ చైవ కౌమారీ వైష్ణవీ తథా "**
**వారాహీ చైవ ఇంద్రాణీ చాముండీ సప్తమాతరా!"**

నప్తమాతృకలకు ఒక తల్లి ఉండాలి కదా! అయితే ఆ మూలపుటమ్మకు పేరు లేదు. అరాధన కోసం ఏదో పేరు పెట్టుకొంటాం. అది వేరే విషయం. కానీ, మూలదేవతకు ఏడు అంశలు- అవి బ్రాహ్మి, మహేశ్వరి, కౌమారీ, వైష్ణవి, ఇంద్రాణి, వారాహి, చాముండి. ఈ ఏడుగురూ శివపార్వతులకు పుట్టినట్లుగా చెబుతారు. ఈ ఏడుగురు అక్కచెల్లెళ్ళు. ఇవి అసలు పేర్లకు సంస్కృతీకరించబడిన నామాలు అయివుండవచ్చు.

## నైష్ఠికులు కూడా

వేదమంత్రాలతో ఇంట్లో పూజా పునస్కారాలు చేసుకునే శిష్టాచార కుటుంబాలు సైతం గ్రామోత్సవాలలో పాల్గొనటం కద్దు. మొత్తం గ్రామానికి రక్షగా నిలచే గ్రామదేవతను భక్తికొద్దీ స్తుతిస్తారు. దండకాలు చెబుతారు. పాటలు పాడుకొంటారు. విద్యావంతులు స్తోత్రాలు దండకాలు చవుతుంటే సంప్రదాయ కుటుంబాల ఆచారాలు, విద్యాగంధం లేని సామాన్య ప్రజలు మైమరచి చిందులు వేస్తారు.

ఈ స్తోత్ర పారాయణ గ్రామదేవత నాగరికమయ్యే క్రమంలో ఒక దశ. స్తోత్రాలు, స్తవాలు, దండకాలు ఎప్పుడు మొదలయ్యాయోగానీ గ్రామదేవతలపైన ఆ సాహిత్యం అపారంగానే ఉంది. మద్రాస్ ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్ లైబ్రరీలో చాలా గ్రంథాలున్నాయి.

ఆర్. నం. 560తో గల ఒక గ్రంథాన్ని 1919లో విజయనగరానికి చెందిన వఝుల చినసీతారామశాస్త్రిగారు గ్రంథాలయానికి అందజేశారు. అందులో 'బి' విభాగంలో అమ్మవారి దండకం ఒకటి ఉన్నది. ఆ దండకాన్ని ఆలవెల్లి సంజీవరాయడు వ్రాశారు. వెంకమాంబ, చినపేరేశ్వరుడు దంపతుల కుమారుడు సంజీవరాయడు. కవిగారు, శక్తిస్తుత్యాత్మకమైన ఈ దండకాన్ని చదువుకొన్నవారికి స్ఫోటక బాధ రాదని వ్రాశారు. వ్యాధి సోకినవారు

చదువుకొన్నట్టయితే బాధ తగ్గిపోతుందని దండకంలోనే వ్రాశారు కవిగారు.

**దండకం**

"శ్రీమన్మహాశక్తి సద్భక్తియుక్తీ జనానందయుక్తీ దురాత్మ ప్రభుక్తీ జగద్వందితానురక్తీ లక్ష్మీ మహామాయా దుర్గా" అంటూ సాగే ఆ స్తోత్రం "కటాక్షించునన్నెప్పుడు న్నాలవెల్లన్వయాభోధి సంపూర్ణ శుభ్రాంశుడైనట్టి చిన్న పేరేశ్వరాఖ్యాత్మ పత్నిన్ సభర్మాత్మయౌ వేంకమాంబా తనూజుండ శ్రీ రామచంద్రాంఘ్రి రాజీవ సేవాధురీణుండ సాంజీవ రాయాఖ్యడన్జేయు నీ దండకంబెవ్వరున్ చదివినన్, విన్నంతలోనన్ మహమ్మారి బాధలున్ తొలగున్ రామా లలామా మహాదేవు భామా నమస్తే నమస్తే నమస్తే నమః " అంటూ ముగుస్తుంది.

చేతితో తయారుచేసిన కొండపల్లి కాగితం మీద కరక్కాయ సిరాతో వ్రాసిన పాఠానికి ఎవరో పండితుడు పెన్సిల్తో వ్యాఖ్యానం వ్రాశాడు. చేతివ్రాత అస్పష్టంగా వుంది. ఆ గ్రంథంలోని మిగిలిన విభాగాలకు కూడా పెన్సిల్తో వ్యాఖ్యానం ఉన్నది. మద్రాసు ప్రాచ్యలిఖిత గ్రంథాలయానికి తాను సమకూర్చిన గ్రంథాలకు బ్రౌన్దొర వ్యాఖ్యానాలు వ్రాశారు. ఈ దండకానికి కూడా ఆయనే ఏదో వ్యాఖ్యానం వ్రాసి ఉండాలి. అంటే ఈ రచన 19వ శతాబ్దం మధ్యకాలానిదై ఉండాలి. బ్రౌన్దొర వ్యాఖ్యానం వ్రాసి ఉండాలనడానికి ఆధారం పెన్సిల్తో వ్రాయడమే. పెన్సిల్తో వ్రాసే అలవాటు ఆయనకే ఉండేది.

తెలుగువారి 'అమ్మ' శబ్దానికి 'అంబ' 'అంబిక' సంస్కృత రూపాలు. ఆ మాతృదేవతే వీరతావైభవం మూర్తిగొన్న దుర్గగా మార్కండేయ పురాణంలో కన్పిస్తుంది. ఆమె పేరుతోనే దేవీభాగవతం, దేవీపురాణం వంటి గ్రంథాలు అవతరించాయేమో.

స్త్రియో దేవాః స్త్రియౌ ప్రాణౌ స్త్రియశ్చైవ విభూషణమ్
స్త్రీ ద్వేషొనైవ కర్తవ్యో విశేషాత్ పూజనం మహత్
స్త్రీ మయశ్చ జగత్ సర్వం తదాత్మానంచ భావయేత్

కృష్ణానందుడు 'తంత్రసారం' గ్రంథంలో స్త్రీమూర్తి ఆరాధనకు గల ప్రాధాన్యాన్ని వివరించాడు. స్త్రీయే దైవమనీ, స్త్రీయే ప్రాణమనీ, స్త్రీయే సమస్త భూషణాలనీ, స్త్రీని విశేషంగా పూజించాలనీ, స్త్రీద్వేషం కూడదనీ, ఈ జగత్తు సమస్తం స్త్రీమయం అనీ వర్ణించాడు.[1]

అసురులు, పిశాచాలు, ప్రాచ్యులు, దస్యులు, యక్షులు, నాగులు ఇలాంటి జాతులు కృష్ణాతీరంలో చరిత్రకు పూర్వకాలంలో నివసించాయని పండితుల అభిప్రాయం. వీళ్ళ దేవతారాధన, పూజా విధానాలు వైదిక విధానాలకు భిన్నంగా వుంటాయి. వాస్తవానికి వేదాలలో ముఖ్యంగా ఋగ్వేదంలో చెప్పిన ఇంద్రుడు, అగ్ని, వరుణుడు లాంటి దేవతలు గ్రామదేవతలు కారు. కొందరు తాంత్రిక దేవతలు వేదమంత్రాలతోను, అంగన్యాస, కరన్యాసాలతోను భక్తుల పూజలందుకొంటారు. అలాంటి దేవతలంతా గ్రామదేవతల వలె పూజలందుకొంటున్నారు.

మన పరిశీలనాంశాలను కృష్ణాతీరానికి పరిమితం చేసినప్పుడు, ఇక్కడ స్త్రీ దేవతారాధన లేదా గ్రామదేవతారాధన అతి ప్రాచీన కాలంనుండీ వుందనేది స్పష్టం.

ఏలి, ఎహువల, కాట్టు, కొట్టి ... వీరంతా తెలుగు ప్రాంతంలో ఒకనాటి దేవతలు. వీరిలో 'ఏలి' స్త్రీ దేవత. క్రీస్తు శకం 2-3 శతాబ్దాలలో నాగార్జున సాగర్ దగ్గరున్న విజయపురిని రాజధానిగా చేసుకొని ఇక్ష్వాక రాజవంశీకులు కొన్నేళ్ళు కృష్ణాతీర ప్రాంతాన్ని పాలించారు. ఆ ఇక్ష్వాకుల శాసనాలలో ఒకచోట "ఏలి ఎహువుల దాసంనక" అనే రాజకుమారుడి పేరు కన్పిస్తుంది. "ఏలి - ఎహువుల దాసుడు" అని ఈ పదానికి అర్థం. ఏలి అంటే దేవత! అంటే ఎహువల దేవుడు. ఇద్దరూ కాలక్రమంలో పార్వతీ పరమేశ్వరులుగా మారి వుండవచ్చు. కాలగణనలో విజయపురి శాసనాల ప్రస్తావన అల్పమైన విషయం, ఏలి, ఎహువలలు గణనకు అందని అతి ప్రాచీన ఆరాధనా మూర్తులు.

ఏలేశ్వరం, ఏలూరు, ఏల పాటలు.... ఇవన్నీ క్రీస్తుకు పూర్వంనాటి 'ఏలి' అనే స్త్రీదేవతకు గల ప్రాచుర్యానికి సజీవ సాక్ష్యాలు.[1]

సుమేరియన్ నాగరికతలో 'అంకి' అనే దేవత వుంది "అం" అంటే అంతరిక్షం అనీ, "కీ" అంటే, భూమి అనీ అర్థం. "ద్యావాపృథివీ" అని ఋగ్వేదంలో వర్ణించినట్లు ఆ "అంకి" భూలోక భువర్లోకాలకు సంబంధించిన దేవత. 'దివి'ని ఏలే అంశని 'అను' అనే దేవుడు గానూ, పృథ్వి అంశని "ఎంకి" దేవతగానూ పిలిచారు. నిప్పూరు అనే సుమేరియన్ ప్రాంతంలో ఎల్లి అనే దేవతకు గుడి వుంది. ఆ ఊరుని ఏకూరు అంటారు. అంటే ఎల్లిదేవతకు ఏకూరు స్థానంగా వుండేదన్నమాట.

రాంభట్ల కృష్ణమూర్తి తన "వేల్పుల కథ"లో మన దక్షిణాదిలో కూడా 'ఏకూరు" అనే ఊరు శైవుల పవిత్ర క్షేత్రంగా వుందని పేర్కొన్నారు. వీరశైవులు ఏకూరయ్య పేరు పెట్టుకొంటారని వ్రాశారు.

కృష్ణాతీరంలో విలసిల్లిన సంస్కృతికీ సుమేరియన్ నాగరికతకు ప్రాచీన కాలంలోనే దగ్గర సంబంధాలున్నాయనీ, బహుశా సింధునాగరికతా కాలానికి సమకాలీనంగా ఇక్కడ తెలుగువారి నాగరికత వర్ధిల్లి వుండవచ్చనీ చాలా మంది చరిత్రకారులు అభిప్రాయపడుతున్నారు.

## ఎంకి

ప్రపంచ ప్రసిద్ధిగాంచిన సుమేరియన్ నాగరికత కాలంనాటి సుమేరియన్లు మెసపొటేమియా (ఇరాన్, ఇరాక్ ప్రాంతాలు)కు వలస వచ్చారు. వీరు తమ పూర్వీకులు సూర్యుడు ఉదయించే దిక్కు నుంచి వచ్చారనీ, తమ మాతృభూమిని స్వర్గభూమి అని చెప్పుకొన్నారు. తాము తెలిమన్ దేశం నుంచి వచ్చినట్టు, 'ఎంకి' తమ దేవుడనీ, తమ మూలపురుషుడు జయశూద్రుడనీ, ఆయన తెలియన్ దేశం నుంచి వచ్చాడని వ్రాసుకొన్నారు.[2]

తెలియన్ నాగరికత మరుగున పడింది. ఈ మరుగున పడిన నాగరికత తాలూకు అవశేషాలు అప్పుడప్పుడు బయట పడుతున్నాయి. ఆ మధ్య ఇరాక్‌లో జరిగిన తవ్వకాలలో లభించిన ఎన్నో రాజభవంతులతో పాటు 'గా- నజిర్' అనే వర్తకుని ఇల్లు తాలూకు శిథిలాలు కూడా వెలుగు

చూశాయి. మట్టి ఇటుకలు కొన్ని దొరికాయి. వాటి మీద వాక్యాలు చూడండి.
అబ్‌బకి (అబ్బకి కావచ్చును)
సెరి (చెరి కావచ్చు)
అక్కు (హక్కు?)
అప్పిలు (అప్పులు ఏమో)
నిమాకు ఇస్కునుటి (మీకు ఇచ్చుకొంటి)
ఎంకి సాకి (ఎంకి సాక్షి ?)

ఆ వాక్యాలు కలుపుకొని పరిశీలిస్తే ఏదో ఆర్థికపరమైన లావాదేవీలు, హక్కులు, ఆస్తి పంపకం, సాక్షులు లాంటి వ్యవహారం ఆ కాలంలో జరిగినట్టు బోధపడుతుంది.

ఆదిమ తెలుగుకు సంబంధించిన వాక్యాలే సుమేరియన్ శాసనాల్లో కనిపిస్తాయి. వాటి ప్రస్తావన ఇక్కడ అప్రస్తుతం కాదు-

ఎహువ, ఎంకి, అంకి లాంటి తెలియని శబ్దాలు ఎక్కడ పుట్టి ఎటు పోయాయో తెలియక పోయినా తెలుగు దేశంలో ఎంకమ్మ, అంకమ్మ, ఎంకి లాంటి శబ్దాలు, దేవతలు ఆదిమ కాలానివేననడానికి ఎలాంటి ఆక్షేపణ లేదు. అంతేగాక ఇరాక్‌లో జరిపిన పురావస్తు పరిశోధనలలో, త్రవ్వకాలలో యజ్ఞవాటికలు బయటపడ్డాయి. ఈ సెమిటిక్ ప్రాంత దేశాలలో వాటిని చూసినవారికి వైదిక సంస్కృతి చిహ్నాలు బయటపడడమేమిటన్న ఆశ్చర్యం కొందరికి కలుగవచ్చు.

సెమిటిక్ ప్రాంతంలో పరిఢవిల్లిన యజుర్వేద సంస్కృతి ఆంధ్ర సంస్కృతికి దర్పణం. అక్కడ వెలుగు చూసిన ప్రాచీన విగ్రహాలు మన గ్రామదేవతల ఉగ్రరూపాలు. ఆ విగ్రహాలను ఆకస్మికంగా ఆంధ్రులు చూస్తే ఇదేమిటి- మన గ్రామదేవతల విగ్రహాలు ఇక్కడ ఉన్నాయి' అని విస్తుపోక తప్పదు.

మన దేశంలో మూడు ప్రధాన సంస్కృతులు కన్పిస్తాయి. మొదటిది గణ సంస్కృతి, దీన్నే ఆది సంస్కృతి అన్నారు రెండవది సుమేరు సంస్కృతి, ఇది వ్యవసాయ సంస్కృతి. మూడవది వేద సంస్కృతి, ఇది స్వయంపోషక సంస్కృతి.

గ్రామదేవతలు ఈ మూడు సంస్కృతుల్లో మొదటిదైన గణ సంస్కృతి నుంచి ప్రారంభమయ్యారు. సుమేరియన్, వైదిక సంస్కృతుల ప్రభావంతో శక్తి రూపిణులుగా రూపు దిద్దుకొన్నారు.

సింధు నాగరికత తవ్వకాలలో 'అమ్మదేవత' బొమ్మ దొరికింది. శక్తి స్వరూపానికి ఇది పూర్వ రూపం. ఈ రూపాన్ని "అమ్మతల్లి" అన్నారు. అనంతరం ఆమె బాలాత్రిపురసుందరి సౌభాగ్యదేవతగా మారింది. అలాగే మూడు ముఖాల దేవుడి బొమ్మ కూడా దొరికింది. ఇది శివుడి పూర్వరూపం.

మనిషికి ముసలితనం వస్తుంది గానీ, సమాజానికి ముసలితనం రాదు. అది కొత్తదనాన్ని సంతరించుకొని నవనవోన్మేషంగా ముందుకు సాగిపోతూ వుంటుంది. పరిణామం సమాజానికి సహజయానం కదా... గ్రామదేవతలు కూడా అంతే! ఎప్పటికప్పుడు క్రొత్తగా అవతరిస్తూంటారు. పాత దేవతల్లో అత్యధికులు వైదిక పద్ధతుల్లో పూజలందుకోవడం ప్రారంభిస్తారు. ఈ ఆరాధన నిరంతరం అలా సాగిపోతూనే వుంటుంది. కొన్ని చోట్ల గ్రామదేవతలకు గుళ్ళున్నాయి. కానీ ఆ గుడులలో అమ్మవారి విగ్రహాలు వున్నా లేకపోయినా పండుగలు చేసుకోవడానికి ఇబ్బంది లేదు. జాతరులకు అడ్డుండదు. గ్రామం వెలుపల చెరువు గట్టుమీద ఒక చెట్టు కింద చిన్న గూడు కట్టి అందులో అమ్మవారి ఆకారం లాంటిది కల్పించి ఒక రాయిని తెచ్చి నిలబెట్టి దాన్నే పూజించుకొంటూ వుంటారు. మూడు రాళ్ళను మూడు వైపులా పాతి పైన ఒక బండరాయితో మూసేస్తే అదే అమ్మవారి గుడి.

ఈ అవకాశం కూడా లేకపోతే, ఓ రాగి చెంబుకో, మట్టి ముంతకో గంధం, పసుపు, కుంకుమ అద్ది అమ్మవారి కళ్ళు నోరు పెట్టి 'ఎల్లమ్మ దేవత' గానో మరో గ్రామదేవతగానో ఆరాధించుకొంటూ వుంటారు. గ్రామ ఎల్లల్లో నెలకొల్పితే ఎల్లమ్మ, పొలిమేరల్లో వుంటే పోలేరమ్మ అయివుండవచ్చు.

ఈ సందర్భంలో పోతన్నగారి సుప్రసిద్ధమైన రుక్మిణీ కళ్యాణంలో ఒక పద్యాన్ని చెప్పుకోవాలి. శ్రీకృష్ణుడు వివాహం చేసుకొంటానని రుక్మిణీదేవికి

వాగ్దానం చేశాడు. చేశాడుగాని రాడు. తనను తీసుకొని పోడు. ఆమెకు భయం పట్టుకొంటుంది. అంతేకాదు "నిన్ నమ్మినవారికెన్నటికి నాశము లేదు గదమ్మ ఈశ్వరీ"- అంటుంది. తన ప్రయత్నంగా అగ్నిజ్యోతనుడనే బ్రాహ్మణుడితో కబురు పంపిస్తుంది. ఏమని? ఆనాటి సాంప్రదాయం ఎలాంటిది? వివాహానికి ముందు పెళ్ళికూతురు ఊరు చివరగల అమ్మవారి గుడికి వెళ్ళి అమ్మవారిని అర్చించాలి. అలా అర్చనకు తాను వెళ్ళినపుడు వచ్చి తనను తీసుకుపొమ్మని చెబుతుంది. ఇక్కడ గమనించవలసిన విషయమేమంటే శ్రీకృష్ణుని కాలంలోనే గ్రామదేవతల ఆరాధన ఉండేది. నగరం వెలుపల ఆలయం ఉండేది.

గుడిలో ఆరాధిస్తే గుడిఎల్లమ్మ, గుడిమైసమ్మ, గుడిమల్లారమ్మ, కట్ట మీద ఆరాధిస్తే కట్టఎల్లమ్మ, కట్టమైసమ్మ. ఇంట్లో గూట్లో పెట్టుకొని ఆరాధిస్తే బాలమైసమ్మ - పెదబాలమ్మ.... ఇలా పిలువబడ్తుంటారు గ్రామదేవతలు. హైదరాబాద్ టాంక్‌బండ్ నిర్మాణం వెనుక ఆసక్తికరమైన కథ వుంది. హుస్సేన్‌సాగర్‌కు కట్టవేయవలసి వచ్చింది. కట్ట నిర్మాణం మొదలైంది. ఎన్నిసార్లు వేసినా కట్ట నిలవలేదు. ఒక స్త్రీకి పూనకం వచ్చి బలి ఇస్తేనే కట్ట నిలబడుతుందని చెప్పింది. బలికి స్త్రీ ఎవరయినా ముందుకు వస్తే ఈనాము ఇస్తానని నవాబు ప్రకటించాడు. ఒక స్త్రీ సిద్ధమైంది. నిర్ణయించిన ముహూర్తానికి ఆమె నిలబడింది. ఆమె మీద మట్టిపోసి కట్టవేశారు. నిర్మాణం పూర్తయింది. ఆమె పేరుతో గుడికట్టారు. అదే నేడు దోమలగూడా లోయరు టాంక్‌బండ్‌లోని మైసమ్మ గుడి.

ఆగ్రహం కలిగితే అమ్మవారు శిక్షిస్తుంది. అనుగ్రహం కలిగితే గ్రామాలను రక్షిస్తుంది. ఆగ్రహాన్ని చల్లార్చి అనుగ్రహం సాధించుకోవడం కోసమే ఈ కొలుపులన్నీ!

## కుమారస్వామి

వీరశైవం తీవ్రంగా వున్న దశలో కాలభైరవ ఆరాధన కూడా బాగా విస్తరించింది. కాలాముఖ కాపాలిక మతాలు, వామాచార విధానాలు,

తాంత్రిక కల్పనలు, భయానక రౌద్ర రసపూరిత పూజా విధానాలు వ్యాపించడంతో పోతురాజు, వీరభద్రుడు, కాట్రేడు, మైలారదేవుడు వంటి పురుషదేవతలు కూడా గ్రామదేవతలుగా పూజలందుకోవడం ప్రారంభం అయ్యింది.

తమిళనాడులో మురుగన్, కార్తికేయన్ పేర్లతో పిలువబడిన కుమారస్వామి, కొండజాతి ప్రజల దేవుడు. ఎత్తయిన కొండలపైనో, దట్టమైన అరణ్యాల మధ్యనో ఆరు ముఖాలు, పన్నెండు చేతులు కల్గిన ఆయన విగ్రహాలు నెలకొల్పి జాతరలు చేస్తుంటారు. ఆయన ఆయుధం బల్లెం. ఎనుబోతుల్ని బలి ఇచ్చి ఆ దేవుణ్ణి సంతృప్తి పరుచుకొంటూ వుంటారు.

స్త్రీ గ్రామదేవతల్ని శివపార్వతుల సంతతిగా చేసినట్లే, పురుషదేవుడుగా భావించి కుమారస్వామిని పార్వతిపరమేశ్వరుల పుత్రుడిగా చేసి వినాయకుడితో పోటీ పెట్టారు. దేవతలకు సేనాధిపత్యం వహించే గౌరవాన్ని కల్గించారు. ఆయుధమే జీవితంగా కల్గిన ప్రజల దేవుడు కాబట్టి ఆయన యుద్ధప్రియుడు, పరాక్రమ ప్రదర్శకుడూ అయ్యాడు.

తూర్పు చాళుక్య రాజ వంశానికి చెందిన యుద్ధ మల్లుడనేరాజు క్రి.శ. 766-810 మధ్యకాలంలో జీవించినవాడు. ఆయన పరమ శైవుడు. బెజవాడలో కుమారస్వామికి గుడిని కట్టించి, ఒక మఠాన్ని నిర్మించి ఇచ్చాడు. ఆ శైవ మఠంలో గొరగలు తప్ప ఇతరులు ప్రవేశిస్తే కాశీలో హత్య చేసినంత పాపం పొందుతారని, ఆ ఇతరుల్ని పట్టుకుని వెళ్ళగొడితే, అశ్వమేధయాగం చేసినంత పుణ్యం పొందుతారనీ ఒక శాసనం వేయించాడు. బెజవాడ యుద్ధమల్లుడి శాసనంగా ఇది ప్రసిద్ధం.

## పూజా విధానం

గ్రామదేవతల్లోనూ స్త్రీ మూర్తులున్నారు. వైదిక మంత్రాలతో పూజలందుకొనే తాంత్రిక దేవతల్లోనూ స్త్రీ మూర్తులున్నారు. వైదిక దేవతా మూర్తులు కరుణామయులు. కన్నబిడ్డల్లా కాపాడు కొంటారు. బిడ్డలు చేసిన

తప్పుల్ని కన్నతల్లి కడుపులో దాచుకొన్నట్లు వైదిక దేవతలు తమ భక్తుల్ని రక్షించు కొంటారు.

కానీ, గ్రామదేవతలు రౌద్ర మూర్తులు. ఆగ్రహం కలిగిస్తే క్షమించరు. పూజల్ని, బలుల్ని నిర్లక్ష్యం చేస్తే ఊరు మొత్తాన్నీ అల్లకల్లోలం చేస్తారు. ఈ దేవతలను క్షుద్ర దేవతలుగా కొందరు పరిగణిస్తారు. రక్తం, మాంసం లాంటివి ఆ దేవతలకు ఇష్టమట.

వైదిక దేవతలపట్ల భక్తితో కూడిన భయం వుంటుంది. కానీ, గ్రామ దేవతలపట్ల భయంతో కూడిన భక్తిని ప్రదర్శిస్తారు. ఆగ్రహం కల్గినప్పుడు అంటువ్యాధులు కరువు కాటకాల్ని సృష్టించినా, అనుగ్రహంకలిగితే అంటువ్యాధులు పోయేట్టు చేస్తారు. పశు సంపద, ధాన్య సంపద, జల సంపదల్ని సమృద్ధి చేస్తారు. దుష్టశక్తుల నుంచి గ్రహబాధల నుంచి ప్రజల్ని రక్షించడం గ్రామదేవతలకు నిత్యకృత్యాలు అని గ్రామీణులు భావిస్తారు.

వైదిక దేవతల పేర్లకు సంస్కృత బాషలో వ్యుత్పత్తి అర్థాలు కనిపిస్తాయి. కానీ, గ్రామదేవతల పేర్లకు అర్థాలు తెలుసుకోవడం చాలా కష్టం. గ్రామదేవతని గ్రామీణుడు అమ్మ, తల్లి, అక్క, చెల్లి అని భావించుకొంటాడు. గ్రామదేవతపైన భక్తితో ఆమె పేర్లని తమ బిడ్డకూ పెట్టుకొంటారు. ఎల్లమ్మ - ఎల్లయ్య, మారెమ్మ - మారెయ్య, మైసమ్మ - మైసయ్య,ఇలా స్త్రీ - పురుషులిద్దరికి ఒకే దేవతా నామం కన్పిస్తూ వుంటుంది.

పోషించే తల్లి కాబట్టి పోశమ్మ లేదా పోచమ్మ అని పిలిచారు. పశువుల దేవత కాబట్టి మహిషమ్మని, మైసమ్మ అన్నారు. జలదేవతని గంగానమ్మ లేక నీరమ్మ అన్నారు. కొండగాలులకు మబ్బులు చల్లబడి వానలొస్తాయని కొండమారెమ్మకు మొక్కుకొంటారు. మారుతం తల్లి మారెమ్మ అయి వుండొచ్చు. మారెమ్మనే 'మారికమ్మ' అని కూడా పిలిచి వుండవచ్చు. 'మార్కాపురం' అసలుపేరు 'మారికాపురం'. ముప్పులు తొలగించే తల్లి ముప్పమ్మ లేదా ముప్పాళమ్మ, ఇంటింటా కవ్వం ఆడి కుండల నిండా

చల్లలు సమృద్ధిగా వుండాలని చల్లలమ్మనీ, చల్లల వ్యాపారం చల్లగా సాగాలని యాపారమ్మనీ, మామిడి దిగుబడి బాగా చేతికి రావాలని మామిళ్ళమ్మనీ... ఇలా తమ స్వంత వ్యవహారాలు కూడా లాభసాటిగా వుండాలని ప్రజలు మూకుమ్మడిగా గ్రామ దేవతల్ని అర్చిస్తుంటారు.

బలి ఇవ్వడం, మొక్కుబడులు లేదా కానుక సమర్పించుకోవడం ఋగ్వేదకాలంలో కూడా అలవాటులో వున్న ఆచారమే! నరబలితో మొదలు పెట్టి కోళ్ళు, మేకలు, గొర్రెలు వంటి చిన్న జంతువుల్ని బలి ఇచ్చే ఆచారాలు వైదిక దేవతలకే వున్నప్పుడు గ్రామదేవతలకు వుండడంలో ఆశ్చర్యంలేదు!

బలిని గ్రహించడం, రక్తపానం, గ్రామ దేవతలందరికి చాలా ప్రీతి పాత్రమైన విషయంగా గ్రామీణులు భావిస్తారు. ప్రభుత్వం నిషేధాజ్ఞలు విధిస్తే భక్తులు బలుల్ని గుడి దగ్గర ఇవ్వకపోవచ్చు. కానీ, జంతుబలి అనేది మాత్రం ఆగదు. మొక్కులు తీరనిదే అమ్మవారు శాంతించదు అని నమ్మే గ్రామీణుణ్ణి, జంతుబలి నిషేధాజ్ఞలు ఆపలేవు. బలి చెల్లించకపోవడం వలన ముప్పు తనకే వస్తుందని భయపడతాడు గ్రామీణుడు.

## కాదంటే కష్టాలే!

గ్రామదేవతల కథల్లో చాలా సందర్భాల్లో తమ శక్తినీ, మహిమనీ శంకించిన వారిపట్ల ఆగ్రహించి, వారికి కష్టాలు కల్గించడం ద్వారా కళ్ళు తెరిపించి భక్తులుగా మార్చిన సన్నివేశాలు అనేకం వున్నాయి.

అగ్ని గుండాన దూకి తనువు చాలిస్తానని పెనుగంచిప్రోలు తిరుపతమ్మ దృఢంగా నిశ్చయించుకొన్నప్పుడు గ్రామ పెద్దలు అభ్యంతరం చెప్పారు. ఆమె తన మహిమని నిరూపించుకుని సర్వజనామోదం పొందాకే సాగుమానం, లేదా సహగమనాన్ని ఆచరించింది. సహగమనం తరువాత గుడి విస్తరణకు తసిల్దార్ అంగీకరించనప్పుడు అమ్మవారు అతని కళ్ళు తెరిపించింది. ఇలాంటి ఆగ్రహ అనుగ్రహాల ఇతివృత్తాలు కృష్ణాజిల్లా గ్రామదేవతల కథల్లో కొల్లలుగా కన్పిస్తాయి.

## స్త్రీ దేవతలంటే చులకనా...!

గ్రామదేవతల్ని ఆడవారని చులకనగా మాట్లాడి భంగపడిన వారి గురించి కూడా అనేక కథలున్నాయి.

అంకమ్మ కథలో శివుడు ఆడదేవతని తన ముందుకు తీసుకురావద్దని ఆజ్ఞాపించాడట, ఈదెమ్మ కథలో "ఆడదైవముతొత్తు" లని గ్రామదేవతల భక్తుల్ని ఈసడించడం "ఆడ దైవాలకు ఉత్సవాలు చేయకండి" అని గ్రామస్థుల్ని ఆజ్ఞాపించడం.. ఇలాంటి సంఘటనలు చాలా జరిగినట్లూ, పరిహసించినవారికి ఆయా దేవతలు గుణపాఠం నేర్పినట్లూ వారి చరిత్రల్లో కన్పిస్తుంది. కాటమరాజు కథల్లో కాటమరాజు "నీవు స్త్రీవి గాన నీకు మ్రొక్కనని" గంగానమ్మని నిరసిస్తాడు.

ఇంద్రుడంతటి వాడే ఋగ్వేదంలో దాశరాజ యుద్ధం జరుగుతున్నప్పుడు దివోదాసు సైన్యంలో వున్న స్త్రీ సైనికుల్ని చూసి ఈ "అబలా సైన్యం నన్నేం చేస్తుంది...." అని హుంకరించినట్లు కన్పిస్తుంది. తొలినాటి మాతృస్వామ్య వ్యవస్థలో పుట్టిన గ్రామదేవతలకు, పురుషస్వామ్య వ్యవస్థలో ప్రారంభమైన వైదిక దేవతలకు మౌలికమైన తేడాని ఇక్కడ మనం గుర్తించడం అవసరం.

## కాల నిర్ణయం

కృష్ణా జిల్లాలో ప్రాచుర్యంలో ఉన్న గ్రామదేవతల్లో, పేరంటాళ్ళుగా ప్రసిద్ధులైన స్త్రీదేవతలలో చాలా మంది రెండు లేక మూడు వందల సంవత్సరాలకు పూర్వులుగానే కన్పిస్తారు. దాదాపుగా వీరి చరిత్రలన్నీ స్పష్టంగానే వున్నాయి. వాటిలో కొన్ని అతిశయోక్తులు సహజంగా వుంటాయి. భక్తిభావం, వీరారాధనలు, అతిశయోక్తుల్ని సృష్టిస్తాయి కూడా! మహిమలనేవి నమ్మకానికి సంబంధించినవి కాబట్టి, నమ్మకాలు ప్రచారంలోకి వచ్చినప్పుడు కొన్ని వాస్తవాలు కొండంతలుగా మారతాయి.

కేవలం మౌఖిక ప్రచారంలో జీవించివున్న పోచమ్మ, పోలేరమ్మ,

నాంచారమ్మ, గంగానమ్మ, ఎల్లమ్మ వంటి గ్రామదేవతలు ఏకాలానికి చెందినవారో నిర్ణయించడం సులభంకాదు. తెలుగువారిలో స్త్రీ దేవతారాధన, గ్రామదేవతారాధన చరిత్రకందని కాలానికన్నా ముందు నుంచే వుంది. కాబట్టి, వారి కాలనిర్ణయానికి పూనుకోవడం వృథా ప్రయాస. ప్రజలు కూడా వారిని ప్రకృతి వైపరీత్యాలకు కారణమయ్యే దేవతలుగానే పూజిస్తారు. వైపరీత్యాలు నివారణ కావాలంటే ఈ దేవతల్ని సంతృప్తి పరచాలి. అంతే! అందుకే ఉత్సవాలు, పండుగలు, జాతరలు.

అలాగే కులదేవతల విషయమూనూ! ఈ కులదేవత ఎప్పుడు ఏర్పడి వుండవచ్చో తేల్చడం కష్టం. కృష్ణాజిల్లాలో కులదేవతల ఉత్సవాలలో కూడా అన్ని కులాలవారూ పాల్గొంటూ ఉండటం కన్పిస్తుంది. కులాలు మనుషులకే గానీ దేవతలకు కాదనడానికి ఇది మంచి తార్కాణం. చౌడమ్మ, బీరప్ప, మల్లన్న, కన్యక... వీళ్ళంతా కులదేవతలే. వీరి చరిత్ర ననుసరించి కాలనిర్ణయం చేయడానికి అనేక అవరోధాలున్నాయి. వెయ్యేళ్ళ క్రితం నాటి కన్యకాపరమేశ్వరి జీవిత కథలోనే అనేక భిన్నాభిప్రాయాలున్నాయి.

## పేరంటాలమ్మలు:

అత్తలు, ఆడబిడ్డలు పెట్టిన ఆరళ్ళు - కట్టుకున్న భర్తలు పెట్టిన చిత్రహింసలు తోడికోడళ్ళు, వదినల అసూయలు- ఇరుగుపొరుగుల ఈసడింపులు - పరాయి పురుషుల అత్యాచారాలు- దైవ దుర్విపాకం వలన కలిగిన కష్టాలు... ఇలాంటి వాటితో ఇడుములపాలై బలవన్మరణం పొంది, పేరంటాళ్ళుగా వెలిసిన స్త్రీమూర్తుల కథలు మనసును ద్రవింపచేస్తాయి.

పేరంటాళ్ళను గ్రామదేవతలుగా భావించవచ్చునా అనే మీమాంస వుంది. తమ పాతివ్రత్య బలంతోనూ, ఆధ్యాత్మిక శక్తితోనూ, మరణానంతరం కూడా మహిమల్ని ప్రదర్శిస్తూ, తమను నమ్ముకొన్న భక్తులను కాచుకొంటున్న శక్తిస్వరూపిణిలే దేవతలుగా పూజలందుకొంటున్నారు, అంతేగాని, ఆత్మహత్యకో, హత్యకో గురి అయిన వారంతా దేవతలు కావడంలేదనేది స్పష్టం.

ప్రకృతి శక్తులకు సంబంధించిన - ఇతర గ్రామదేవతలు కూడా పేరంటాలమ్మలతో సహకరించి మానవకోటిని సంరక్షిస్తూ వుంటారని గ్రామీణుల విశ్వాసం. వాళ్ళ ఆధ్యాత్మిక శక్తి ఈ భూమి మీద అజరామరంగా వుంటుందని భావిస్తారు.

ఒకేసారి బహిరంగంగా అందరికి దర్శనం ఇచ్చిన పెనుగంచిప్రోలు తిరుపతమ్మ, సామర్లకోట కామమ్మ కథలు ఈ విషయాన్ని చెప్తాయి. ఎక్కువ సార్లు, పేరంటాలమ్మలు సమీప వ్యక్తులకు, లేదా పుర ప్రముఖులకు కలలో కన్పించి తనకు గుడి కట్టించాలని, జాతర జరిపించాలనీ ఆదేశించిన సంఘటనలు కన్పిస్తాయి. ఒక్కోసారి తన చరిత్రలు గ్రంథస్థం చేయాలనీ పూనకాల ద్వారా కూడా ఈ ఆదేశాలు జారీ అవుతుంటాయి.

ఇతర గ్రామదేవతల మాదిరి పేరంటాలమ్మలు కూడా శక్తి స్వరూపిణులే! ఆగ్రహ స్వరూపిణులు కూడా! ఊరు మొత్తానికి ఉమ్మడిగా అపకారం జరుగుతున్నప్పుడు ఫలానా పేరంటాలమ్మకు ఆగ్రహం కల్గిందని గుర్తించి జాతరలు చేసి వారిని తృప్తి పరుస్తుంటారు. జాతరలు చేసే విధానంలో ప్రకృతి రూపాలైన గ్రామదేవతలకు, మానవ రూపిణులైన పేరంటాలమ్మలకు తేడాలు కన్పించవు. అంటే పేరంటాలమ్మలు గ్రామదేవతలతో తాదాత్మ్యం చెందారన్నమాట."

రాజరామ్మోహనరాయ్ బ్రహ్మసమాజం పక్షాన చేసిన కృషి ఫలితంగా 1830లో సతీసహగమనం నిషేధం అమలుకు వచ్చింది. అయినప్పటికీ కొందరు స్త్రీ మూర్తులు ప్రభుత్వాధికారుల ముందు తమ ఆత్మశక్తిని ప్రదర్శించి మహిమ చూపించి సహగమనం చేసిన వారున్నారు. ఇలాంటి పేరంటాలమ్మలలో కామమ్మ మొదటిదని డా॥ బిరుదురాజు రామరాజు వ్రాశారు.

## అంకమ్మపేరంటాలు

అంకమ్మ కథ ఎక్కడ జరిగిందో తెలియదు. భర్త వెంకయ్య పశువుల మేత కోసం వెళ్ళినప్పుడు పులివాత పడి చనిపోయాడు. అంకమ్మ

సహగమనం చేసింది. బహుశ ఇది 18 వ శతాబ్దంలో జరిగిన సంఘటన అయివుండొచ్చు. ఇంతకు మించిన వివరాలు దొరకలేదు.

కృష్ణాజిల్లాలో అంకమ్మ జాతరగానీ, కొలుపులుగానీ చేస్తున్న గ్రామాలు ఎక్కువగా వున్నాయి. బందరు దగ్గర గూడూరులో పాల్గుణ పౌర్ణమికి అంకమ్మ జాతర చేస్తారు. గన్నవరం దగ్గర వెదురుపావులూరులో అంటువ్యాధులు ప్రబలినప్పుడు, కొండపల్లి దగ్గర చీమలపాడులో జ్యేష్ఠమాసంలో మూడు రోజులు, బెజవాడ దగ్గర రామవరప్పాడులో సంక్రాంతి మూడు రోజులూ, కంచికచర్ల దగ్గర జయంతి గ్రామంలో చైత్ర పౌర్ణమి రోజున, నందిగామ దగ్గర 'వెలది' గ్రామంలో చైత్ర బహుళ దశమి రోజున, తిరుపూరు దగ్గర మునకుళ్ళ గ్రామంలో ప్రతి చైత్ర పౌర్ణమిరోజునా, గంపలగూడెం దగ్గర కొత్తపల్లి, తిరువూరు దగ్గర మాధవరం (తూ)లోనూ మాఘపౌర్ణమి రోజున అంకమ్మ జాతరలు నిర్వహిస్తున్నారు.

గ్రామదేవతల్లో అంకమ్మ చాలా ప్రాచీన దేవత అయివుండవచ్చు. ఇతర గ్రామదేవతల గుడులలో చాలాచోట్ల అంకమ్మ దేవత విగ్రహంకూడా వుంటూ వుంటుంది. అన్నం వండిన కుండని కుంభం అంటారు. దాన్ని తెచ్చి అమ్మవారి ముందు వుంచి నైవేద్యం పెట్టుకొంటారు. జంతు బలులు సహజంగా జరుగుతుంటాయి.

అంకమ్మని మానవ రూపంలోనే పూజిస్తారు. స్త్రీరూప విగ్రహాల్ని రాతితోగాని, చెక్కతోగాని చెక్కిన వాటిని అర్చనకు ఉపయోగిస్తారు. అంకమ్మ దేవతావిగ్రహానికి మూడు చేతుల్లో. పాము, పుర్రె, కొరడా వుంటాయి. పశువులు, పల్లెప్రజల్ని రక్షించేదేవతగా అంకమ్మ నాల్గవ చేత్తో ఆశీర్వదిస్తూ వుంటుంది. ఈ అంకమ్మ గ్రామదేవత పేరు పెట్టుకున్న అంకమ్మ అనే ఒక స్త్రీ. 17వ శతాబ్దంలో సాగుమానంచేసి పేరంటాలమ్మ అయింది. ప్రకృతి స్వరూపిణి అయిన అంకమ్మతో సమానంగా పూజలందుకుంటోందని మనం అర్థం చేసుకోవచ్చు.

## అంకమ్మ దండకం

అంకమ్మనే బండి వీరమహాకాళి అని కూడా అంటారు. ఈ క్షుద్రదేవత అంటు వ్యాధులు ప్రబలడానికి కారణమనీ, ఈ తల్లిని పూజిస్తే వ్యాధులు ఉపశమిస్తాయని గ్రామీణుల విశ్వాసం.

కర్త ఎవరో తెలియదుగానీ, అంకమ్మ దండకం పేరుతో మద్రాసు లైబ్రరీలో ఓ గ్రంథం వుంది. ఆ దండకం ఇలా సాగుతుంది.

"శ్రీ రాజరాజేశ్వరీ దేవ శైలేశ్వరీ లోక రక్షాకరీ
శాంకరీ శాంభవీ కాళీ మాయీ జగద్భద్రరూపే
భవానీ శథాత్రానుతా శేష శాయీ రమాభారతీంద్రాణి
పూజా ప్రియాంఘ్రి ద్వయీ శ్యామలాంబా నమో
భ్రామరాంబా నమో జాగదాంబా ననతా శారదా.... అంటూ సాగిన స్తోత్రపాఠం.

ఆబాల వృద్ధాదులం గూడి గ్రామోప
కంఠంబు పర్యంతమాద్యంతము పూజింతుమో
యమ్మ ఓ కొర్ల అంకమ్మ నీవుండ దయాంబోధి
కృపా దృష్టి వీక్షించి శీతాంఘ్రి ఘాతంబు
నన్ మమ్ము దయజేసి రక్షించు ఓ బండి
వీరా మహంకాళీ ఓ లోకమాతా మతంగాత్మ
జాతా నమస్తే సమస్తే నమః

అంటూ ముగుస్తుంది. గ్రంథాంతాన వ్యాఖ్యాత ఇలా వ్రాశాడు. కొర్ల అంకమ్మ అనీ, బండి వీర మహంకాళి యని పలు తెరగుల పేర్లు గల సాంక్రామిక వ్యాధి దేవత స్తుతి యిందలి విషయము. కర్త పేరెరుగరాదు.

## అచ్చమ్మ పేరంటాలు

కొండపల్లి సమీపంలో కవులూరు గ్రామం వుంది. బహుశ ఈస్టిండియా కంపెనీ పాలనాకాలం అది. పాపయ్య అచ్చమ్మ దంపతులు

అన్యోన్యంగా జీవిస్తున్నారు. పాపయ్య పశువుల మేతకు వెళ్ళి పులివాతపడి అకస్మాత్తుగా మరణించాడు. పతి వియోగం భరించలేని అచ్చమ్మ ప్రభుత్వం దగ్గర అనుమతి తీసుకొని సహగమనం చేసింది.

సహగమనం కోసం చితి మంటల్లో దూకబోయే ముందు తాను దేవతనై వెలుస్తాననీ, తనను పేరుతో మూడుసార్లు పిలిస్తే పలుకుతాననీ చెప్పి "సాగుమానం" (సహగమనం) చేసింది. ఆమె మహిమని పరీక్షించడం కోసం అక్కడ చేరిన గ్రామస్థులు మూడు సార్లు ఆమెను బిగ్గరగా పిలిచారు. ఆమె తక్షణం వాళ్ళముందు ప్రత్యక్షమైంది. తన మహిమకు నిదర్శనంగా తనకు గుడి కట్టమని ఆదేశించింది. గ్రామస్తులంతా కలిసి అచ్చమ్మ పాపయ్యలకు అక్కడ గుడి కట్టించారు. ప్రతి ఏడాదీ కార్తీక శుద్ధ పౌర్ణమి రోజున కవులూరులో అచ్చమ్మ పాపయ్యల కళ్యాణం ఘనంగా జరుగుతుంది.

మేకపోతులు బలిచ్చి, గండదీపాలు వెలిగించి పూటకొలుపు చేస్తారు. అన్ని కులాలవారూ ఈ జాతరలో పాల్గొంటారు.

## అలివేలమ్మ తల్లి

నందిగామ సమీపంలో చందర్లపాడు గ్రామం వుంది. ఇక్కడ అలివేలమ్మ తల్లి గుడి వుంది. చేతిలో బిడ్డను ఎత్తుకున్న అలివేలమ్మ విగ్రహం ఈ గుడిలోని ప్రత్యేకత.

అలివేలమ్మ చరిత్ర 17వ శతాబ్ది నాటిదై వుండచ్చు. ఆమె కథ ఎక్కడ జరిగిందో తెలియదు. చందర్లపాడులో ప్రత్యేకంగా ఆమె ఆరాధన జరుగుతోంది కాబట్టి ఈ కథ ఈ వూరిలోగాని, పరిసరాలలోగాని జరిగి వుండవచ్చని ఊహించవచ్చు.

అలివేలమ్మ భర్త పులివాతపడి మరణించినప్పుడు చితి పేర్చుకుని చంటిబిడ్డతో సహా మంటల్లోకి దూకి సహగమనం చేసింది. అప్పటినించీ

ఆమెను శక్తి స్వరూపిణిగా భావించి గుడి కట్టి ఆరాధిస్తున్నారు చందర్లపాడు పరిసర గ్రామాల ప్రజలు.

వైశాఖ శుద్ధ పౌర్ణమి నుంచి చవితి వరకూ అయిదు రోజులపాటు భక్తితో అలివేలమ్మని ఆరాధించి జాతరలు జరుపుతారు. ఈ అయిదు రోజులూ ప్రభలు కట్టి, అమ్మవారిని ఊరేగించి పప్పుబెల్లాలు, గారెలు, బూరెలు, పరమాన్నం నైవేద్యంగా సమర్పించుకొంటారు. కార్తీక సోమవారంరోజున, శివరాత్రిరోజున, అలాగే పౌర్ణమిరోజున కూడా అలివేలమ్మ భక్తులు ఉపవాసాలుంటూ వుంటారు.

కనీసం 250 సంవత్సరాలుగా ఈ జాతర నిర్వహిస్తున్నట్లు స్థానికులు చెప్తున్నారు. కుమ్మరి కులానికి చెందినవారు పూజారులుగా వుంటారు.

## అద్దంకి నాంచారమ్మ తల్లి

దివిసీమలో ఈనాటికీ అద్దంకి నాంచారమ్మ ప్రసిద్ధ దేవతగా పూజలందుతోంది. 1823 నందన కరువు కాలంలో ఒంగోలు నుంచి మచిలీపట్నం దాకా ఊళ్ళన్నీ మనుషుల, జంతువుల అస్థిపంజరాలతో కప్పబడి వున్నాయని గోర్డాన్ మెకంజీ కృష్ణా డిస్ట్రిక్ట్ మాన్యువల్‌లో రాశాడు. ఇలాంటి దుర్భర కరువు పరిస్థితులు తాండవిస్తున్న రోజుల్లో ఒక విచిత్ర సంఘటన జరిగింది. ఈ సంఘటన దివిసీమను కాటకం బారినుంచి రక్షించిందని భక్తుల విశ్వాసం.

కొండవీటి రామన్న అనే రైతు దివిసీమ విశ్వనాథ్‌పల్లెలో నివసించేవాడు. (18వ శతాబ్దం వరకు ఆ గ్రామాన్ని విశ్వనాథునిపల్లి అనేవాళ్ళు) నందన కరవు వచ్చాక తింటానికి మనుషులకు తిండి, పశువులకు మేత కరవైపోవడంతో గొడ్డు, గోదాతో సహా దివిసీమ వదిలి అద్దంకికి తరలిపోయాడు. బహుశా అద్దంకి అతని పూర్వీకులు నివసించిన గ్రామం అయివుండొచ్చు. ఈ కరవు 1832-34 మధ్య వచ్చింది.

అద్దంకిలో ఒకయోగి ఇచ్చిన శాపం కారణంగా నాంచారమ్మ తల్లి

మానవ రూపంలో అద్దంకిలో సంచరిస్తోంది. ఆమె కొండవీటి రామన్నని కరుణించి నిజరూపంతో దర్శనం ఇచ్చింది! ఈ కరవు బారినించి రక్షించి మళ్ళీ జన్మస్థలం విశ్వనాథపల్లి వెళ్ళేలా చేస్తాననీ, తనని భక్తితో పూజించాలనీ ఆదేశించింది నాంచారమ్మ. అది మొదలు మనసులో ఎలాంటి సంశయాలు అనుమానాలూ పెట్టుకోకుండా నిజమైన భక్తితో నాంచారమ్మని కొలిచాడు కొండవీటి రామన్న. కరవు నెమ్మదించింది. రామన్న కోల్పోయిన తన సంపదనంతా తిరిగి పొందాడు.

నాంచారమ్మ తల్లి కిచ్చిన మాట ప్రకారం, విశ్వనాథపల్లి చేరి, గ్రామం వెలుపల తన శక్తి కొలది చిన్న గుడిని నిర్మించి, అందులో నాంచారమ్మతల్లి విగ్రహాన్ని ప్రతిష్ఠింపచేశాడు రామన్న.

నాంచారమ్మని భక్తితో కొలిచిన వారి కోరికలు నెరవేరుతుండటంతో ఆమె ప్రశస్తి దివిసీమ మొత్తం వ్యాపించసాగింది. అద్దంకి నుంచి వచ్చిన దేవత కాబట్టి ఆమెను అద్దంకి నాంచారమ్మగా భక్తులు పిలుచుకోసాగారు.

పెద్దప్రోలు, పిట్టల్లంక గ్రామాల్లోకూడా అద్దంకి నాంచారమ్మకి గుడులున్నాయి. జాతరలు సాగుతున్నాయి. జాతరల సమయంలో గాజులు రవికల గుడ్డలు, పసుపు కుంకుమ అమ్మవారికి సమర్పించుకొంటారు. జంతుబలులు తక్కువ అని స్థానికులు చెబుతారు.

పాల్గుణమాసం శుద్ధ విదియ నుంచి పౌర్ణమి దాకా పద్నాలుగు రోజుల పాటు అద్దంకి నాంచారమ్మ తల్లి జాతర నిర్వహిస్తారు. మొదటిరోజు అమ్మవారి విగ్రహాన్ని బయటకు తెచ్చి ఊరేగించడం ప్రారంభించి, పద్నాలుగవ రోజున మాత్రమే గుడికి చేరుస్తారు. మొదటి రోజు కాపువీధిలోనూ, రెండవ రోజు అగ్నికుల క్షత్రియుల వీధుల్లోనూ, మూడవరోజు కుమ్మరిపాలెంలోనూ, నాల్గవరోజు కొత్తపాలెంలోనూ, అయిదు ఆరు రోజుల్లో పొరుగున వున్న సాలెపాలెంలోనూ, ఏడవరోజు గౌడ వీధిలోనూ, అక్కడనుంచి నాయీబ్రాహ్మణ వీధి, రజకవీధి, దొమ్మరి వీధుల్లోనూ, ఒకరోజు కరణంగారి ఇంటి దగ్గర, పౌర్ణమి రోజున బ్రాహ్మణ అగ్రహారంలోనూ అమ్మవారి విగ్రహాన్ని ఊరేగిస్తారు.

మేళతాళాలు, ప్రభలు, విచిత్ర వేషాలు, భేతాళ నృత్యాలు వంటి వేడుకలు చేస్తుంటారు. ఒకపుట్టి - అంటే, పదమూడు బస్తాల బియ్యం అన్నం వండి నైవేద్యం సమర్పిస్తారు. వండిన కుండల్ని వండినట్లు అమ్మవారి ముందుంచి భక్తులు కుంభం సమర్పించుకొంటారు. దక్షిణలు ఇచ్చి మొక్కుబడులు చెల్లించుకొంటారు.

అమ్మవారి గుడిలో నిత్యదీపారాధన జరుగుతుంది. నలభైరోజులు దీక్షగా ప్రదక్షిణలు చేస్తారు. జంతుబలులు జోరుగానే సాగుతాయి. నాంచారమ్మకు సహస్ర నామావళి, అష్టోత్తర నామాలతో అర్చనలు చేస్తుంటారు. పూర్వం అష్టోత్తర నామావళి లాంటివి ఉండేవి కావు. అంటే ఈ అమ్మవారు క్రమంగా వైదికమవుతున్నదన్నమాట! బ్రాహ్మణ కులాల వారు కూడా ఈ దేవతకు భక్తులుగా వుండడంతో గ్రామదేవతల విధానంతోపాటు వైదిక విధానాలు కూడా ఆచరణలోకి వచ్చాయి.

కొంత మంది నాంచారమ్మ జాతర సందర్భంగా హంసలదీవి వెళ్ళి సముద్రస్నానం కూడా చేస్తుంటారు. కొండవీటి రామన్న, అద్దంకి నాంచారమ్మతల్లిని విశ్వనాథపల్లికి తెచ్చాడు కాబట్టి, అప్పటినుంచి అతని వంశీకులు లేదా అతని కులస్థులు కొండవీటి కాపులు దేవాలయ అర్చకత్వాన్ని నిర్వహిస్తున్నారు. ఘంటసాల బ్రాహ్మణులు కూడా అర్చకస్వాముల్లో వున్నారు. నవరాత్రి ఉత్సవాలు జరిగేటప్పుడు బ్రాహ్మణ పూజారులు పూజాది విధులు నెరవేరుస్తుంటారు.

తిరునాళ్ళు, సంతలు కూడా ఈ ఉత్సవాల సమయంలో పెద్దస్థాయిలో జరుగుతుంటాయి. హరికథలు, సంగీత కచ్చేరీలు నాటకాల ప్రదర్శనలు ఏర్పాటు చేస్తుంటారు.

## నాంచారమ్మ వలస

విచిత్రమేమంటే అద్దంకిలో ఇప్పుడు నాంచారమ్మలేదు. ఆ తల్లి దివిసీమకు, నేటి ప్రకాశం జిల్లా కొత్తపట్నానికి వలసపోయిందని అద్దంకిలో వృద్ధులు అంటారు. ఈ విషయం అవనిగడ్డ కథనంలో ధ్రువపడుతున్నది.

ఈ సందర్భంలోనే గ్రామ దేవతల విషయంలో దైవభక్తి, పాపభీతి ఈషణ్మాత్రం కూడా లేని కొందరు గ్రామ పెద్దల దురాగతాన్ని కూడా చెప్పుకోవాలి. 1858కి పూర్వం అద్దంకి (ఇప్పుడు ప్రకాశం జిల్లాలో ఉన్నది) నెల్లూరు జిల్లా చందలూరు తాలూకాలో ఉండేది. అప్పటి తాసిల్దార్ (1854లో) నెల్లూరు జిల్లా కలెక్టర్‌కు నాంచారమ్మ గుడి వ్యవహారాలపై ఒక నివేదిక పంపాడు. అందులో 'ఈ గుడిని మూసివేయడం సమంజసం. అర్చకత్వం విషయంలో వాది ప్రతివాదుల మధ్య తగాదాలతో గుడి పాడుబడి పోతున్నది. పైగా గ్రామంలో కక్షలు, కార్పణ్యాలు మొదలయ్యాయి' అని వ్రాశాడు.

అనంతర పరిణామాలకు, చందలూరు తాసిల్దార్ నివేదికకు ఏదైనా సంబంధం ఉన్నదో లేదో తెలియదు గాని రామిరెడ్డి, సాంబిరెడ్డి అనే ఇద్దరు వాది ప్రతివాదులు తమ అనుచరగణంతో గుడి వ్యాజ్యం విషయంలో అద్దంకి నుంచి ఒంగోలు కోర్టుకు బయలు దేరారు. అంతలో సమీపానగల కొత్తపట్నంలో అద్దంకి నాంచారమ్మ వెలసిందన్న వదంతి పుట్టింది. అందులో నిజానిజాలు తెలుసుకోవడం కోసం ఆ ఇద్దరు రెడ్డి మహోదయులు కొత్తపట్నం వెళ్ళారు. నిజంగానే అద్దంకి నాంచారమ్మ విగ్రహం సముద్రం ఒడ్డున కనిపించింది. వారిద్దరు భక్తితో నమస్కరించారు. విచిత్రమేమంటే అదే సమయానికి అద్దంకిలో నాంచారమ్మ విగ్రహం అదృశ్యమైంది.

రెండు వర్గాల మధ్య వైషమ్యాలు లేకుండా చేయడం కోసం చందలూరు తాసిల్దార్ చేసిన లౌక్యం ఇదని కొత్తపట్నం, అద్దంకి గ్రామాల్లో వృద్ధులు చెబుతారు. ఆ విధంగా అద్దంకి నాంచారమ్మ వివాదం నుంచి బయటపడి కొత్తపట్నం గ్రామంలో కూడా వెలసిందని అంటారు.

## విశ్వనాథపల్లిలో

అమ్మవారు విశ్వనాథపల్లి ప్రాంతంలో నెలకొన్నాక అనేక గ్రామాలలో నాంచారమ్మ తల్లిని తమ గ్రామ దేవతగా నిలుపుకున్నారు. విశ్వనాథపల్లిలో ఉండే అద్దంకి నాంచారమ్మ ఇక్కడ కులదేవత. నాంచారమ్మ

తల్లి పాడి పంటలను కాపాడే దేవతగా ప్రఖ్యాతి గాంచింది. అందువల్లనేమో రైతులు అమ్మవారి జాతర మహోత్సవం సందర్భంగా తమ పశువులను గుడి చుట్టూ ప్రదక్షిణలు చేయిస్తూ ఉంటారు.

1950 వరకూ అమ్మవారికి నిత్యపూజలు, జాతర మహోత్సవం గ్రామస్తుల ఆధ్వర్యంలో జరిగేవి. అనంతరం ఆలయాన్ని దేవాదాయ ధర్మాదాయ శాఖ తన అధీనంలోకి తీసుకొని అభివృద్ధి చేయడం ప్రారంభించింది. ప్రతి ఏటా అమ్మవారికి పాల్గుణ మాసం పున్నమి రోజున వైభవంగా జాతర మహోత్సవం జరపడం ఆనవాయితీగా వస్తోంది. జాతర మహోత్సవానికి కృష్ణ, గుంటూరు. ప్రకాశం, ఉభయ గోదావరి జిల్లాల నుంచే కాక ఇతర ప్రాంతాల నుండి సైతం భక్తులు లక్షలాదిగా తరలివచ్చి మొక్కులు తీర్చుకొంటారు.

అమ్మవారి ఆలయ ప్రాంగణంలో సంతానంలేని యువతులు తమకు సంతాన ప్రాప్తి కలిగించమని నాంచారమ్మను వేడుకొంటూ కృష్ణా స్నానం చేసి తడి వస్త్రాలతో ప్రాణాచారం పడుతుంటారు. కోరిన కోర్కెలు తీర్చటంతో భక్తుల సంఖ్య ఏటేటా విపరీతంగా పెరుగుతోంది. అమ్మవారికి పొంగళ్ళు, వేడి నైవేద్యాలు నివేదనగా సమర్పిస్తుంటారు, మానెడు సోలెడు బియ్యం, పెసరపప్పు, కొద్దిగా బెల్లం, నెయ్యి కలిపి వండిపెడతారు. ఇప్పటికీ భక్తులు తమ పెంపుడు జీవాలను ఆలయం చుట్టూ తిప్పి చెవులను కత్తిరించి అమ్మవారికి రక్తం చూపించి తమ మ్రొక్కులు తీర్చుకుంటున్నారు. తమ పశుసంపదనే కాకుండా వాహనాలను సైతం అమ్మవారి ఆలయ ప్రదక్షిణం చేయించి తమను చల్లగా చూడమని ప్రార్థిస్తూ వుంటారు.

ప్రస్తుతం అమ్మవారి ఆలయం కాలక్షేప మండపం, ముఖ మండపం, గర్భగుడి అనే మూడు విభాగాలతో కనిపిస్తుంది. 1986లో నూతన ఆలయ శంకుస్థాపన జరగ్గా 1987లో ఆలయ పునర్నిర్మాణం, నాంచారమ్మదేవత విగ్రహ ప్రతిష్ట వైభవంగా జరిగాయి. 1990లో వచ్చిన తుఫానుకు ధ్వజస్తంభానికి వున్న మేఖలాలు ఊడిపోయి రేకు లేచిపోయి చెక్క చివికిపోగా చెక్క ధ్వజస్తంభాన్ని తీసివేశారు. దేవాలయానికి నిధులు

లేకపోవడంతో భక్తుల సహాయ సహకారాలతో 10-2-1999న శాస్త్రోక్తంగా ముఖమండపాన్ని, నూతన ధ్వజస్తంభాన్ని ప్రతిష్ఠించారు. 2000లో కాలక్షేప మండపాన్ని నిర్మించారు.

అమ్మవారి ప్రధాన జాతరకు పదిహేను రోజుల ముందు ఉత్సవాలు ప్రారంభమౌతాయి. ముందు అమ్మవారిని ప్రతిష్ఠించిన ముగ్గురు అన్నదమ్ముల్లో ఒకరైన రామినీడు చెక్క విగ్రహాన్ని (ఇప్పటికి ఆలయంలో వుంది) బయటకు తీసి కృష్ణానదిలో స్నానం చేయించి పూజాదికాలు నిర్వర్తించి నైవేద్యాలు సమర్పిస్తారు. దీనినే రామినీడు ఉత్సవం అంటారు. అనంతరం అమ్మవారిని బయటకు తీస్తారు. అంతేగాక కొండవీటివారి వంశంలో ఏ శుభకార్యం జరిగినా తొలుత రామినీడు పూజ చేస్తారు. అమ్మవారి ఆలయ ప్రాంగణంలో చంటిపిల్లలను ఊయల వూపుతారు.

పూర్వం గ్రామోత్సవంలో పెద్ద అమ్మవారిని త్రిప్పేవారు. ఆ రోజుల్లో కేవలం మూడు కుటుంబాలకే పరిమితమైన గ్రామోత్సవంలో పెద్దఅమ్మవారిని మోసుకుని తిప్పేవారని గ్రామ పెద్దలు చెపుతున్నారు. కాలానుగుణంగా కుటుంబాలు పెరగడం, అమ్మవారిని తిప్పడం కష్టం కావడంతో కృష్ణానదిలో కొట్టుకు వచ్చిన గంధపు చెక్కతో చిన్న అమ్మవారిని తయారు చేయించి ఒకపెట్టెలో భద్రపరచి దానిని గ్రామోత్సవంలో ఇంటింట త్రిప్పి పూజలు చేస్తున్నారని గ్రామస్తులు వివరించారు.

## మరో కథనం

దివిసీమ 'గాబ' గ్రామంలో కథనం వేరొక రకంగా వుంది. ఒక గంధపు చెక్క కృష్ణానదిలో కొట్టుకువస్తే తొలిసారిగా అమ్మవారిని ఆ చెక్కతో తయారు చేయించారని దానినే గ్రామోత్సవంలో పదిహేను రోజులపాటు త్రిప్పుతున్నట్టు తెలిపారు. ఆలయంలో చిన్నరాయిని ఏర్పాటు చేశారు. తొలుత చిన్న అమ్మవారు ఉండగా ఇప్పుడు పెద్ద అమ్మవారుగా రూపుదిద్ది ప్రాణ ప్రతిష్ట చేసి ఆలయంలో అమర్చారు. ఇప్పుడు చిన్న అమ్మవారు

గ్రామాల్లో తిరుగుతున్నప్పటికీ ఆలయంలో పూజలకు విఘాతం కలుగకుండా భక్తులు సందర్శించుకుంటున్నారు.

కాగా, గాబ గ్రామంలో అమ్మవారికి వేద మంత్రాలతో ప్రాణప్రతిష్ట, పూజావిధానం విశేషంగా జరుగుతున్నది. గాబలో అమ్మవారికి ఊయల ఉత్సవం ఊరేగింపు తరువాత జరిగే అమ్మవారి ఆలయ ప్రవేశ సమయంలో మాత్రమే జరుగుతుంది. ఆడపడుచు లాంఛనాలన్నీ అమ్మవారికి గాబ గ్రామంలో జరగడం మరో విశేషం. అమ్మవారు తమ ఆడపడుచుగా బ్రాహ్మణ కుటుంబీకులైన పోతరాజు వంశీయులు చెపుతుంటారు . అవనిగడ్డలో వేంచేసియున్న లంకమ్మతల్లి గ్రామోత్సవంలో తొలిపూజలు పోతరాజువారి ఇంట అందుకోవడంలో అంతరార్థం ఇదే.

అమ్మవారి నిత్య పూజల్లో పూజారులుగా కొండవీటి ఇంటి పేరుగల కుటుంబాలు పాల్గొంటున్నా విశేష పూజల్లో బ్రాహ్మణ పూజారులు సైతం పూజలు నిర్వహిస్తారు.

అమ్మవారి గ్రామోత్సవంలో ఒక విశేషం ఉంది. ఒక కుటుంబంలోని సభ్యుల ఇళ్లలో పూజలు అందుకుంటేగాని మరో కుటుంబ సభ్యుల పూజకు తీసుకువెళ్ళరు. ఇది అనాదిగా వస్తున్న ఆచారం.

## ఇరుములమ్మ తల్లి

దివిసీమలో ప్రసిద్ధి చెందిన గ్రామదేవతలలో ఇరుములమ్మ అతి ప్రాచీన దేవత. నంగిగడ్డలో ఆమె గుడి వుంది. దేవతార్చనలు జరుగుతుంటాయి. ఈమెకు బలులు సమర్పించే ఆచారం తక్కువ. నిత్యం దీపారాధన చేస్తుంటారు. కొబ్బరి కాయలు కొట్టి అమ్మవారిని పూజిస్తారు.

## కామమ్మ కథ

మద్రాస్ ప్రెసిడెన్సీకి వాలీస్ గవర్నర్‌గా వున్న కాలంలో తూర్పుగోదావరి జిల్లా సామర్లకోటలో సహగమనం జరిగింది. దానికి సంబంధించిన కరుణపూరితమైన కథ కామమ్మకథ. ఈ కథ తాలూకు

ప్రతులు ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్స్ లైబ్రరీలో చాలా ఉన్నాయి. 2501 నంబరుతోగల గ్రంథంలో దేశీ ఛందస్సులో ఒక కథ ఉన్నది. రచయిత ఎవరో తెలియదు.

స్థూలంగా కథ ఇది:

1810 ప్రాంతంలో సామర్లకోట ప్రాంతానికి చెందిన తిరుపతి మారెయ్య అనేవాడు ఉండేవాడు. మద్రాసులో వాలీస్ దొరకు పల్లకీ మోసే బోయీల చీఫ్‌గా పనిచేసేవాడు. అతడు కామమ్మ అనే అమ్మాయిని పెళ్ళి చేసుకొన్నాడు. ఆమెకు ఇంకా వ్యక్తత రాలేదు. కాపురానికి కూడా తీసుకురాలేదు. తిరుపతయ్య వంటరిగా మద్రాసు వెళ్ళి వాలీస్ దొరకు బోయిగా పనిలో కుదిరాడు. ఆరేళ్ళపాటు పెద్దబోయిగా పనిచేశాడు.

మద్రాసు నుంచి సామర్లకోటకు కాలినడకన వస్తూ వుండగా దారిలో జబ్బుచేసింది. జబ్బుతోనే ఇంటికి చేరాడు. కొద్దిరోజులకే మరణించాడు.

కామమ్మ సహగమనానికి సిద్ధమైంది. జిల్లా కలెక్టర్ అనుమతి కోరింది. కలెక్టర్ అనుమతించలేదు. కామమ్మ తన మహాత్మ్యం చూపించింది. లార్డ్‌వాలీస్ మిడాస్, పెన్నిస్‌గిరి, ఓక్స్ దొరలు ఆశ్చర్యం చెందారు. వెంటనే సహగమనానికి అనుమతి ఇచ్చారు.

అప్పటికే తిరుపతయ్య దహనం జరిగింది. ఆయన అస్థికలను కామమ్మ వెంట తెచ్చుకొన్నది. చితిపేర్చి అస్థికలను గుండెలమీద పొదివి పట్టుకొని చితికి నిప్పు అంటించి మంటలలో కలసిపోయింది కామమ్మ.

ఈ అంత్యక్రియలను పైన పేర్కొన్న దొరలు స్వయంగా సామర్లకోట వెళ్ళి చూచారట.

కామమ్మ తన భర్తపట్ల తనకు గల ప్రేమను ప్రజలు కలకాలం చెప్పుకోవాలని ఆశించింది. మాదాసు వెంకయ్య అనే ఒక కవిని పిలిపించి 25 వరహాల డబ్బు, తన పెనిమిటి బంగారు వస్తువులను బహుమానంగా ఇచ్చి తన చరిత్రను గ్రంథంగా వ్రాయమని కోరిందట.

ఈ రచన మాదాసు వెంకయ్యదే కావచ్చునని వ్యాఖ్యాత వ్రాశారు. ఈ చరిత్రాంశాన్ని బట్టి చూస్తే వాలీస్ దొర బెంగుళూరు కోటను, మీడాస్ శ్రీరంగపట్టణాన్ని కొట్టిన తరువాత ఈ ఉదంతం జరిగినట్టు కనిపిస్తున్నది.

శుభము కామమ్మ శుభము కామమ్మా శుభము
శుభమొంది సామర్లకోట లోనమ్మా కామమ్మ
సుకవట్ల లక్ష్మయ్య ముద్దుకూతురుగా కామమ్మ
వెంకమ్మ గర్భాన జననమైనాదీ కామమ్మ
బొంది యింట్లోనూ జీవమక్కడా కామమ్మ
చెన్నపట్నములోనూ వాలీసు, మేడీసు పనీసెగిరి
రాకాసు వాలీసు కలలోను చెప్పే కామమ్మ
నైనప్ప మొదలారి కలలోను చెప్పే కామమ్మ
దూబాసి కలలో తాజెప్పినాదీ కామమ్మ
లాడ్డుదొరగారి బట్లలన్నీ పసుపు చేసినాదీ కామమ్మ
ఒకనాడు రెణ్ణాళ్ళు మూన్నాళ్ళు చూచీ దొరగారు
ఒకనాడు దయ్యమవో భూతమవో అని అడిగినాడు దొరగారు
మీ పెద్దబోయడూ ఘనుడ మారెయ్య మారెయ్య
ఆరు యేండ్లా కొలువు కొలిచి పోలేదా మీ వద్ద
ఏడో యేటనే ఇంటికొచ్చెనుగా మారెయ్య
వస్తానే చనిపోయినాడు మారెయ్య యింటొద్ద
ఆ మారెయ్య భార్యాను కామమ్మ నేను దొరగారు
నేను- కలకటేరొద్దకే సెలవు కెళ్ళాను గుండానికి
నన్ను- ఏడు రోజులదాక తసీలు చేసే ఆ దొర
గొప్ప ధొరవూ అనీ నీ శెల్వు కొస్తీ దొరగారు
ఆ రాత్రి కలలోను తా చెప్పినాదీ కామమ్మ

మాదాసు వెంకయ్యను పిలిపించినాదీ కామమ్మ
తను పుట్టింది పెరిగింది వ్రాయమన్నదిగా కామమ్మ

కవనమేరుపరచి ప్రకాస్తి చెయ్యూ వెంకయ్య
పాతికె వరహాలు వెంకయ్యకిచ్చేను కామమ్మ
మారెయ్య నగలన్నీ వెంకయ్యకిచ్చేను కామమ్మ
దేశాలమీదనే ప్రకాస్తి చెయ్యూ వెంకయ్య
అప్పుడు మారెయ్య హస్తులూ విప్పుకొచ్చింది కామమ్మ
మారెయ్య హస్తులు గుండాన వేసేను కామమ్మ
గుప్పించి ఆ తల్లి గుండాన ధూకే కామమ్మ
యెదురుతడి కెలు వారు కప్పించినారు గుండాన
నాలుగోపాలీ యేమనీ పలికె కామమ్మ
కార్తీక పున్నాన తిరునాళ్ళ నాకూ పాపయ్య
చూడవచ్చిన ప్రజలు తిరిగి వెళ్ళిరిగా ఆవేళ
మూడు రోజులు దాక దొరలు వున్నారు అక్కడను
మూడోనాడైన చల్లారిపించి గుణ్ణామూ
మారెయ్య రుమాల అట్టెవున్నదిగా గుండంలో
మూరెడు మైజారు చెరుగువున్నది గుండంలో
మంగళసూత్రాన బొందువున్నదిగా కామమ్మది
వకచేతి గాజులూ ఒక కాలిమెట్టలు అట్టె ఉన్నవిగా గుండాన
యరకలువపువ్వు పుట్టుకొచ్చింది గుండంలో

ఇదంతా కామమ్మ మహత్యం చెప్పే భాగం. కాగా తరువాతి కథనం ఆమె భక్తురాలి కథ.

బ్యాల వెంకమ్మ గర్భిణి వుండె అప్పుడు
తొమ్మిది మాసములు మోసింది యేమీ వెంకమ్మ
తొలిచూలు వెంకమ్మ కొడుకునూ గనెనూ వెంకమ్మ
మారెయ్య పేరెట్టి మన్నించి పిలిచె వెంకమ్మ
మలిచూలు కూతురు కలిగింది యేమీ వెంకమ్మకు
కామమ్మ పేరెట్టి మన్నించి పిలిచీ వెంకమ్మ
వరు బంగారు ఉయ్యాల తొట్లు చేయించె కామమ్మకు

గుళ్ళోను ఆ తొట్టె యాలాడకట్టె వెంకమ్మ
వక నిమ్మపండయ్యా వూగుంటుంది కామమ్మ
కామమ్మ చరిత్ర విన్నవారికీ నీ భాగ్యములు
తియ్యక వుండునూ దీర్ఘాయుగలుగూ యెప్పటికీ.

"ఉత్తమ శీలము, త్యాగము, పాతివ్రత్యము మొదలైన సద్గుణాలు తక్కువ కులము వారి యందు కూడ ఉండునని కామమ్మ నిదర్శనమిచ్చుచున్నది. ఆ పతివ్రత అట్టి గుణముల కలది కాబోలు కీర్తిశేషులు బసవరాజు అప్పారావుగారు "కాపుకోడలు కామమ్మ కలియుగాన - సాగుమానము చేసిన సచ్చరిత్రను తలపోసిరి..." అన్నారు.

సాగుమానం చెయ్యడం అంటే, సహగమనం చెయ్యడం అని! అగ్రవర్ణాల వారు గ్రామదేవతలను ఆరాధించరు. ఆరాధించినా, ఆదేవతలకు వైదిక దేవతలతో సంబంధాలు కలుపుతారు. బ్రాహ్మణేతరస్త్రీలే కులసతులుగా, పరమ పతివ్రతలుగా, అమితమైన మనశ్శక్తితో, ఆధ్యాత్మిక శక్తితో దేవతలు కాగలగడం పేరంటాలమ్మల కథల్లో మనకు కన్పించే నగ్నసత్యం!

పూజారులుగా బ్రాహ్మణులే వుండాలనే నియమం లేని వ్యవస్థ గ్రామదేవతలది. కొలుపులన్నా అమ్మవారి ఆదేశం ప్రకారమో, ఆచారం ప్రకారమో సాగుతుంటాయి. వేదమంత్రాలతో పూజిస్తేనే అర్చన అవుతుందనుకోవడం గ్రామదేవతల విషయంలో నిజం కాదు.

## కొండమారెమ్మ

కొండమారెమ్మ వానదేవత. వర్షాలు లేనప్పుడు గంగానమ్మ జాతరతో పాటు కొండమారెమ్మ జాతర కూడా చేస్తూంటారు. ఇతర గ్రామదేవతలతో కలిపి ఉత్సవాలు నిర్వహిస్తుంటారు.

ఉయ్యూరు దగ్గర పెనమలూరులో కొండమారెమ్మ జాతర ఘనంగా జరుగుతుంది.

## కొల్లేటికోట పెద్దింటమ్మ

కొల్లేరు సరస్సు నడిమిన కొల్లేటికోట వుంది. గుడివాడ భీమవరం రైల్వే లైనులో కైకలూరునుంచిగానీ ఆకివీడు నుంచిగానీ కొల్లేటికోటకు చేరవచ్చు. ఒకప్పుడు ఇక్కడ జలదుర్గ దేవాలయం వుండేది. అంబదేవరాయలు ఈ కోటని జయించిన తర్వాత అందులో పెద్దింటమ్మని ప్రతిష్టించాడు. ఈ గుడినే మాతంగిదేవి గుడి అనీ, కోటశక్తి దేవాలయం అని కూడా అంటారు.

ఫాల్గుణ శుద్ధ పాడ్యమి నుంచి బహుళ పాడ్యమి దాకా పదహారు రోజులపాటు ఫిబ్రవరి, మార్చి నెలల్లో పెద్దింటమ్మ జాతర వైభవంగా జరుగుతుంది.

దశమి, ఏకాదశి, ద్వాదశి ఈ నాలుగురోజులూ జాతరలో ముఖ్యమైన పండుగ రోజులు. కొల్లేటికోట దగ్గర గోకర్ణపురం గ్రామంలో గోకర్ణేశ్వరాలయం వుంది. ఈ ఉత్సవంలో భాగంగా, ఫాల్గుణ శుద్ధ ఏకాదశి రోజున జలదుర్గ గోకర్ణేశ్వరస్వాముల కళ్యాణం నిర్వహిస్తారు. కోటకు దూరంగా జంతు బలులు జరుగుతాయి. కృష్ణా, పశ్చిమ గోదావరి జిల్లాల సరిహద్దు ప్రాంతం కావడంతో రెండు జిల్లాల నుంచి భక్తులు అధిక సంఖ్యలో తరలి వస్తుంటారు.

## కోట మహిషమ్మ

నూజివీడు జమిందారీలో గ్రామదేవత కోటమహిషమ్మ. ఇక్కడ మహిషమ్మకు గుడి వుంది.

ఆశ్వయుజ శుద్ధ పాడ్యమి నుంచి దశమి దాకా, దసరా రోజుల్లో కోటమహిషమ్మ జాతర చేస్తారు. ఒకప్పుడు అమ్మవారిని ఏనుగు అంబారీపై ఊరేగించేవాళ్ళు. మొక్కులు తీర్చుకొని కొబ్బరికాయలు కొట్టడం నైవేద్యాలు సమర్పించుకోవడం చేస్తుంటారు.

మొదట జమీందార్లు ఈ జాతర చేసేవాళ్ళు. జమీందారీలు పోయిన తర్వాత పురప్రముఖులు నిర్వహిస్తున్నారు. ఇప్పుడు బాగా తగ్గిపోయింది.

బుట్టబొమ్మలు ప్రదర్శన ఇంక అనేకా వినోద కార్యక్రమాలు ఈ సందర్భంగా ఏర్పాటు చేసేవాళ్ళు. దసరా రోజుల్లో నూజివీడు ఉత్సవ వాతావరణంలో కోలాహంగా వుండేది..... ఆ రోజుల్లో !!

## గంటాలమ్మ తల్లి

వానలు కురవనప్పుడు కొన్ని గ్రామాల్లో గంటాలమ్మ జాతర చేస్తుంటారు ఒక్కోసారి ముత్యాలమ్మ, మహాలక్ష్మమ్మ, గంటాలమ్మల్ని ముగ్గుర్నీ కలపి ఒకేసారి జాతర కూడా నిర్వహిస్తుంటారు. నందిగామ దగ్గర గండేపల్లి గ్రామంలో గంటాలమ్మ జాతర చేస్తుంటారు.

పశువులు ఆరోగ్యంగా వుండాలనీ, పంటలు బాగా పండాలనీ, వానలు సమృద్ధిగా కురవాలనీ, గంటాలమ్మవారికి మొక్కుకొంటారు.

నందిగామ దగ్గర గని ఆత్కూరులో మహాలక్ష్మమ్మ, ముత్యాలమ్మ, గంటాలమ్మలతో పాటు పోలేరమ్మని కూడా కలిపి జాతర నిర్వహిస్తుంటారు. జ్యేష్ఠమాసంలో ఒక రోజున తప్పనిసరిగా ఈ జాతర చేస్తారు.

గ్రామంలో పొంగు, ఆటలమ్మవంటి వ్యాధులు ప్రబలినప్పుడు ఇంకా గంటాలమ్మకి మొక్కుకొంటారు. గొర్రెల్ని, మేకల్ని, కోళ్ళని బలులిచ్చుకొంటారు. పసుపు కుంకుమ, గాజులు కొబ్బరికాయలు సమర్పించుకొంటారు.

అన్ని కులాల ప్రజలూ ఈ ఉత్సవాల్లో పాల్గొంటూవుంటారు.

## గంగానమ్మ తల్లి

కృష్ణాజిల్లాలో గంగానమ్మ కొలుపు చెయ్యని గ్రామం ఉండదు. ఒక చిన్న గూడులాగా గంగానమ్మ గుడిని కట్టి ఆనవాయితిగా సంబరాలు జరిపే ప్రసిద్ధ గ్రామాలు పాతిక పైనే కన్పిస్తాయి.

జింజేరు గ్రామం బంటుమిల్లి దగ్గర వుంది. ఇక్కడ గంగానమ్మకు పెద్ద గుడి వుంది. ఇక్కడ గోగులమ్మ, గంగానమ్మ, మారెమ్మ, మద్దిరామమ్మ,

ముత్యాలమ్మ, మావుళ్ళమ్మ విగ్రహాలున్నాయి. ఈ గ్రామదేవతలందరికీ కలిపి పండుగల్ని నిర్వహిస్తుంటారు. ఈ ఉత్సవాల్లో అన్ని కులాల వాళ్ళు పాల్గొంటారు.

పెడన దగ్గర హుస్సేన్‌పాలెంలో గంగానమ్మ ఘటాన్ని అర్చిస్తారు. అంటే మట్టి విగ్రహాన్ని తయారు చేసి ఉత్సవానికి ఉపయోగిస్తారు.

బందరు దగ్గర గూడూరు, జుఝువరం గ్రామాలలో, వైశాఖ పౌర్ణమి రోజున కొండపల్లి దగ్గర, వెంకటాపురంలో వ్యాధులు ప్రబలిన సమయంలోనూ, బెజవాడ దగ్గిర నిడమానూరులో మార్గశిర పౌర్ణమి రోజున, పోరంకిలో జూన్ నెలలో గానీ, ఆగష్ట్ నెలలోగానీ గంగానమ్మ జాతరలు చేస్తుంటారు.

గుడివాడ దగ్గర లింగాలలోనూ, మోటూరు దగ్గర పర్ణశ గ్రామంలోనూ ప్రతి ఆదివారం గంగానమ్మను భక్తులు సందర్శించి అర్చిస్తుంటారు.

కైకలూరులో కూడా గంగానమ్మ గుడి వుంది. వీరమ్మ జాతర చేస్తారు. ప్రభలు కట్టి పెద్ద స్థాయిలో నిర్వహిస్తుంటారు.

## గోగులమ్మ తల్లి

బంటుమిల్లి దగ్గర జింజేరు గ్రామంలో గోగులమ్మ తల్లి గుడి వుంది. గ్రామంలో వ్యాధులు ప్రబలినప్పుడు అమ్మవారికి ఆగ్రహం వచ్చినట్లు భావించి జాతరలు నిర్వహిస్తూ వుంటారు. గోగులమ్మ, మద్దిరామమ్మ, ముత్యాలమ్మ, మావిళమ్మ, మారెమ్మ, గంగానమ్మలకు కొలుపులు చేస్తుంటారు. ముడుపులు కట్టుకోవడం, జంతు బలులిచ్చుకోవడం, మొక్కుబడులు చెల్లించుకోవడం చేస్తుంటారు.

కుమ్మరులు, కళావంతులు, గౌడలు, కాపులు ఈ గ్రామదేవతల పండుగకి ఆధ్వర్యం వహిస్తుంటారు.

# గొంతెమ్మ, గొంతాలమ్మ తల్లి

తెలుగులో "అష్టాదశ వర్ణాల వారికీ అట్లతద్దె" అనే సామెత వుంది. అట్లతద్దె పండుగని అగ్రవర్ణాల నుంచి దళిత కులాలవారి వరకూ అందరూ జరుపుకునే పండుగ అని దీని అర్థం.

ఆశ్వయుజమాసంలో బహుళ తదియ రోజున అట్లతద్దె జరుపుకొంటారు. ముసలి మొగుళ్ళు రాకుండా కోరుకొన్న భర్త లభించడం కోసం అట్లతద్దె పండుగని నియమబద్ధంగా జరిపిస్తుంటారు ఆడపిల్లల చేత ఇళ్ళలో పెద్దవాళ్ళు.

కోరుకొన్న భర్తనీ, కోరుకున్న సంతతినీ పొందిన కుంతిదేవికీ ఈ అట్లతద్దికీ సంబంధంవుంది. అయితే, కుంతీదేవిని అగ్రవర్ణాల వారు దేవతగా అంగీకరించరు. ఆమె శాపగ్రస్థ. తప్పు చేసింది.... అనే అభిప్రాయం కావచ్చు. కానీ, 'మాల, మాదిగ కులస్థులు అట్లతద్దినాడు కుంతిదేవి పండుగ జరుపుకోవడం కృష్ణాజిల్లాలో చాలా చోట్ల కన్పిస్తుంది.

''హిందువుల పండుగలు పర్వములు'' గ్రంథంలో సురవరం ప్రతాపరెడ్డిగారు దళితులు కుంతీదేవి పండుగను జరుపుకోవడానికి గల కారణాన్ని వివరించారు. భారత యుద్ధం తర్వాత ధర్మరాజు యుద్ధంలో చనిపోయిన తన దాయాదులకి తిలోదకాలు వదుల్తున్నప్పుడు, తర్పణోదకం అందుకోవడానికి కర్ణుడి చెయ్యి వచ్చిందిట. ధర్మరాజు ఆశ్చర్యపడి ఇలా ఎందుకు జరిగిందని వ్యాసమహర్షిని అడిగాడట. కర్ణుడు అతనికి అన్నయ్య అనీ, తర్పణలు వదలవలసిందనీ సూచించాడట. అసలు కథంతా అప్పుడు ఆయనకి తెల్సింది. "ఈ సంగతి ముందే తెలిసివుంటే, యుద్ధమే జరగకుండా చేసేవాణ్ణి కదా..." అని బాధపడ్డాడట. కర్ణుణ్ణి కనే విషయంలోనే కాదు, ఆ రహస్యాన్నీ యుద్ధం జరిగాక కూడా దాచిపెట్టడం పెద్ద తప్పుగా భావించి తల్లి కుంతీదేవిని మాలల దేవతవు కమ్మని శపించాడట.... అప్పటినుంచి గొంతెమ్మ మాలల ఇలవేల్పయ్యిందనే కథ జానపదుల్లో వ్యాప్తిలో వుంది.

## గంగాధరంగారి కథనం:

నేదునూరి గంగాధరంగారి సెలయేరు గ్రంథంలో ఇంకో కథ చెప్పారు. కుంతీదేవి చిన్నప్పుడు ఒక ఆంబోతును పెంచిందట. ఆ ఆంబోతు ఊళ్ళో పంట చేల మీద పడి మేస్తుంటే, ఓ రైతు దాన్ని పట్టుకెళ్ళి గాజు స్తంభానికి కట్టేసి కొట్టబోయాడట. గొంతెమ్మ అంతఃపురంలోంచి బైటకు వచ్చి, ఆరైతుకు వెయ్యి వరహాలు నష్ట పరిహారం ఇచ్చుకొందిట.

"కాపోరి జేను కెళ్ళితే కట్టి పెడతారు, ముద్దూల నందన్నా
మాలవారి చేనులో మసలుమా ముద్దులా నందన్న
మాలోరు మంచోరు మక్కువతో కొలుస్తారు ముద్దూల నందన్న..."

అని ఎద్దుకు కుంతిదేవి హితోపదేశం చేసిందట!

ఎద్దు పంటచేనుని పాడు చెయ్యడం, దాన్ని కుంతిదేవి ప్రేమతో చూసుకోవడం, కాపులు కథనంగానూ, మాలలు దయాహృదయంతో పశువుల్ని కాచుకోవడం.... ఇదంతా "గొంతెమ్మ పండుగ" పంటల పండుగ అని సూచిస్తున్నట్లు పండితులు పేర్కొంటారు.

రేగడి మట్టిలో పాలుపోసి పిసికి గొంతెమ్మ బొమ్మ తయారుచేసి తెల్లవార్లూ దళిత వాడల్లో ఊరేగించి నదిలో కలుపుతారని డా॥ చింతపల్లి వసుంధరారెడ్డి గోదావరి జిల్లాలో అలవాటుగా వున్న ఒక సాంప్రదాయాన్ని తెలియజేశారు. తెలుగు కోయ ప్రజలు భీమసేనుణ్ణి తమ వంశీకుడుగా చెప్పుకుంటారు. నిషాదరాజు వేణుచక్రవర్తి అడవులు నరికి జనావాసాలు ఏర్పరుస్తున్నప్పుడు భీమసేనుడు అతని తల్లి గొంతాలమ్మ కావలి కాసి తోడ్పడ్డారట. భూదేవి కోసం జాతర చేసి బలి ఇచ్చే ఉత్సవంలో ఒక నర్తకిని చూసి భీమసేనుడు ప్రేమలో పడ్డాడనీ, ఆ ఇద్దరికీ పుట్టిన వంశీకులే కోయలనీ ఒక నమ్మకం.

మొత్తం మీద కుంతిదేవిని అగ్రవర్ణాల వారు తిరస్కరిస్తే దళిత

వర్గాల ప్రజలు కడుపులో పెట్టుకొని కాచుకొన్నారని, దిక్కులేనివాళ్లుగా ఈ సమాజంలో కర్ణుడిలా తిరస్కృతులుగా ఇన్నాళ్ళు జీవిస్తున్న తమకు కన్నతల్లి లాంటిది కుంతిదేవి.... అని భావించారనీ మనం అర్థం చేసుకోవచ్చు.

కృష్ణాజిల్లాలో దళిత వాడల్లో కుంతీదేవికి గొంతాలమ్మ పేరుతో పండుగలు జరుపుతుంటారు. తోట్లవల్లూరు దగ్గర పెనమకూరులోనూ, కైకలూరులోను ప్రముఖంగా ఈ ఉత్సవాలు జరుగుతుంటాయి. పెనమకూరులో దసరా సమయంలో ఆ పది రోజులూ గొంతాలమ్మ పండుగ చేసుకొంటారు. కైకలూరులో భాద్రపద బహుళ విదియ రోజున అట్లతద్దినాడు ప్రారంభించి పది రోజులపాటు పండుగ చేస్తారు.

పదవ రోజున దళిత వాడల్లో ఊరేగించి ఊరవతల విడిచి వస్తారు. నంది బొమ్మనీ, కప్ప బొమ్మనీ ఊరేగించిన తర్వాత ఊరవతల వదలడాన్ని " సాగనంపు" అంటారు.

## చంద్రమ్మ - మల్లయ్య

పెనుగంచిప్రోలు తిరుపతమ్మకు మల్లయ్య బావగారు. చంద్రమ్మ తోడికోడలు అవుతుంది. మల్లయ్య చనిపోయినప్పుడు, ఆయన భార్య చంద్రమ్మ కూడా సాగుమానం చేసి దేవతగా వెలిసింది. తిరుపతమ్మ గుడిలోనే మల్లయ్య, చంద్రమ్మల విగ్రహాలకు పూజలు చేస్తారు. జాతరలు కొలుపులూ తిరుపతమ్మతో కలిపే నిర్వహిస్తూ వుంటారు.

## తిరుపతమ్మ పేరంటాలు

తిరుపతమ్మ పేరంటాలు నందిగామ సమీపంలో వున్న పెనుగంచిప్రోలులో వెలిసిన కృష్ణా జిల్లాలో అత్యంత ప్రాచుర్యం కల్గిన గ్రామ దేవత.

తిరుపతమ్మ కారణజన్మురాలు. సాధారణ స్త్రీలమాదిరి కష్టాలు సహనంతో భరించింది గానీ, పూర్తిగా ఆమె మరణానికి ముందే దైవత్వాన్ని సంతరించుకొని ప్రశస్తి పొందింది.

వీళ్ళది గోగినేనిపాలెం. కొల్లా శివరామయ్య రంగమ్మల ఎనిమిదవ ముద్దుల కూతురు తిరుపతమ్మ. తిరుపతి వెంకటేశ్వరుడి వరప్రసాదం అని స్వామిపేరుతోనే తిరుపతమ్మ అని పిలిచారు. అల్లారుముద్దుగా పెంచారు. తల్లిదండ్రులు గారాబం చేసినా, శ్రీ వెంకటేశ్వరుడి పట్ల అపారభక్తితో పూజల్లోనే ఎక్కువ కాలం గడుపుతూవుండేది చిన్ననాటి నుంచి తిరుపతమ్మ.

పెనుగంచిప్రోలులో రంగమ్మ అన్నగారు కాకాని కృష్ణయ్య వుండేవాడు. ఆర్థికంగా స్థితి మంతుడు కాకపోవడంతో కాకాని కృష్ణయ్యగారు తన కొడుక్కి తిరుపతమ్మనిచ్చి పెళ్ళి చేయ్యమని స్వయంగా వచ్చి అడిగాడు. మొదట్లో కొంత తటపటాయించినా ఈ వివాహానికి అంగీకరించాడు శివరామయ్య.

తిరుపతమ్మ అత్తవారింటికి వెళ్ళేప్పుడు నాగేంద్రుడు పడగపట్టి ఆమెకు నీడనిచ్చాడని భక్తులు చెప్పుకొంటారు. ఆమె అడుగుపెట్టింది మొదలు అత్తవారింట్లో సంపదలు తొణికిసలాడసాగాయి. గృహిణిగా తన ధర్మం నేరవేరుస్తూ అందరికీ తలలో నాలుకలా మెలిగేందుకు ప్రయత్నించ సాగింది తిరుపతమ్మ. పతియే ఆమెకు ప్రత్యక్ష దైవం.

తిరుపతమ్మ పాతివ్రత్యం, ఆమె హస్తవాసి, దైవభక్తి అందరినీ ఆకట్టుకున్నాయి. పెనుగంచిప్రోలులో మంచి పేరుతెచ్చుకోసాగింది తిరుపతమ్మ. అదే ఊళ్ళో చెంబేటి పాపమ్మ అనే ముదిరాజు కులానికి చెందిన భక్తురాల్ని తిరుపతమ్మ బాగా ఆకర్షించింది. ఆమె కష్ట సుఖాలను గమనిస్తూ తిరుపతమ్మనే అంటిపెట్టుకొని వుండేది పాపమ్మ.

ఈ దశలో నందిగామలో అనావృష్టి పరిస్థితులు ఏర్పడి, పశువులకు మేత కరువైంది. కొన్ని కట్టి వున్నాయి. మేత చాలక కొన్ని వట్టిపోయేలా వున్నాయి. పశువుల్ని కాపాడు కోవాలంటే, గోదావరి మన్యం వైపు వాటిని తోలు కెళ్ళడం అవసరంగా భావించాడు గోపయ్య.

భర్త ఊరుదాటి వెళ్ళంగానే తిరుపతమ్మ కాపురంలో చిచ్చు

రగులుకొంది. తోడికోడలు, అత్తగారు కూడా పెద్దకోడలికి వంతపాడారు. కారణం ఒకటే... అసూయ! ఊరంతా తిరుపతమ్మని మెచ్చుకోవడంతో తోడికోడలికి సహజంగానే కడుపు రగిలింది. తనకు రాని పేరు తన తోడికోడలికి రావడం సహించలేకపోయింది. ఎక్కడో లోపల్లోపల అత్తగారిలో కూడ ఇదే అభిప్రాయం వుండివుంటుంది... ఇద్దరూ కలిసి తిరుపతమ్మని రాచి రంపాన పెట్టడం మొదలుపెట్టారు.

అత్తా, తోడికోడలూ ఎన్ని కష్టాలు పెట్టినా చెంబేటి పాపమ్మ ఊరడించి మనోధైర్యాన్ని నూరిపోయసాగింది. ఏ విషప్రయోగం జరిగిందో తెలియదు. తిరుపతమ్మ శరీరం అంతా మొద్దుబారిపోయింది. కుష్టు రోగం వచ్చిందని లాక్కెళ్ళి గొడ్లసావిట్లో పడేసి మట్టిపిడత కూడూ, ముంత నీళ్ళూ పోయడం మొదలు పెట్టారు.

చెంబేటి పాపమ్మ తోడుగా వుండడంతో వెంకటేశ్వరుని ధ్యానిస్తూ భర్త రాకకోసం ఎదురు చూడసాగింది తిరుపతమ్మ.

ఒకరోజు గోపయ్య ఇంటికి వచ్చాడు. కళ్ళారా భార్య పరిస్థితి చూశాడు. భోరుమని ఏడ్చింది తిరుపతమ్మ. అత్త, తోడికోడలు పెట్టిన కష్టాలన్నీ చెప్పుకొంది. తనకు సంక్రమించిన వ్యాధి గురించి మొత్తుకొంది. గోపయ్య చలించిపోయాడు. పశువుల్ని వెనక్కి తోలుకొచ్చేస్తాననీ, మళ్ళీ వదిలి వెళ్ళనని మాట ఇచ్చి చకచకా బయల్దేరాడు.

రోజులన్నీ మన చేతుల్లో వుండవు కదా - గోపయ్య తిరుగు ప్రయాణంలో వున్నప్పుడు ఒక పులి అరణపు ఆవుని పొట్టన పెట్టుకొంది. అది తనకు ఎంతో ఇష్టమైన ఆవు కావడంతో గోపయ్యకు కోపం వచ్చింది. పులిని వేటాడి చంపడం కోసం వెదకసాగాడు. అది ఎక్కడో పొంచి వుంది. అదను చూసుకొని గోపయ్య మీద పడింది. పులిని చంపుతానని బయల్దేరి పులికి ఆహారంగా మారి పోయాడు గోపయ్య.

గోపయ్య మనుషులు అతని బట్టల్ని, చెప్పుల్నీ ఆనవాలుగా తీసుకొని

పెనుగంచిప్రోలు బయల్దేరారు. ఈ దారుణ వార్త విని ఊరు ఊరంతా అవాక్కయ్యింది. తిరపతమ్మ మూర్ఛపోయింది.

మూర్ఛ నుంచి ఎప్పటికో తెప్పరిల్లింది తిరుపతమ్మ. తన సర్వస్వం పోయిన తర్వాత ఇంతసేపు ఇంకా తానెలా బతికుండగలిగాను... అనుకొంది. భర్త కడసారి చూపులక్కూడా తనకు అవకాశం లేకుండా పోయింది. ఇంక తాను ఎవరి కోసం బతకాలి. వెంటనే చితిని పేర్చి సహగమనం చేయడానికి ఏర్పాట్లు చెయ్యవలసిందిగా ఊరు పెద్దల్ని కోరింది.

మామగారొచ్చి జాగ్రత్తగా చూసుకొంటాం శాంతించమని కోరాడు. ఇరుగు పొరుగూ అందరూ నచ్చ చెప్పే ప్రయత్నం చేశారు. తిరుపతమ్మ తన భర్త చెప్పుల్ని గుండెల మీద పెట్టుకొని సహగమనానికి సిద్ధం అయ్యింది. అత్తగారు, పెద్దకోడలు చంద్రమ్మ, తమ తప్పు తెలుసుకొని క్షమించమని కోరారు. తిరుపతమ్మ వారిని పెద్ద మనసుతో మన్నించి, నమస్కరించి ఆశీస్సులు కోరింది.

## నిదర్శనాలు

గ్రామ మున్సబు కర్ల ముత్యాలు, గ్రామకరణం కొమ్మరాజు శ్రీ శైలపతి మాత్రం ఆమె సహగమనానికి అధికారికంగా అభ్యంతరం చెప్పారు. ఊరు జనం కూడా ఎవ్వరూ తిరుపతమ్మ సహగమనానికి అంగీకరించలేదు.

కరణం, మున్సబులిద్దరూ ఇళ్ళకు వెళ్ళి పోయారు. భోజనానికి కూర్చుంటే, అన్నం అంతా వాళ్ళకి పురుగులుగా కన్పించడం మొదలు పెట్టిందట! ఒక్కరికైతే పైత్యం ప్రకోపం అనుకోవచ్చు - కరణం, మున్సబు లిద్దరికీ అలానే కన్పించడంతో ఆ యిద్దరూ భయపడ్డారు. ఇది తిరుపతమ్మ మహత్యమేనని గట్టిగా నిర్ణయించుకొని, సహగమనానికి అనుమతి ఇవ్వాలని నిర్ణయించుకున్నారు. అంతే అంతకు ముందు పురుగులుగా కనుపించిన అన్నం మామూలుగా మారింది. సహగమనం చేస్తే తిరుపతమ్మ

పేరంటాలు అవుతుందనీ, గొప్ప మహిమలు ప్రదర్శిస్తుందనీ కరణం మున్సబు గార్లిద్దరికి అర్థం అయ్యింది. ఊరంతా ఈ సంగతి చెప్పడంతో తిరుపతమ్మ మహాత్మ్యం క్షణాల్లో చుట్టు పక్కల ఊళ్ళన్నీ పాకిపోయింది.

తిరుపతమ్మ సహగమనం తిలకించడానికి తండోపతండాలుగా వచ్చారు జనం. చుట్టుపక్కల ఊళ్ళన్నీ పెనుగంచిప్రోలుకి దారితీశాయి.

బంధుమిత్రుల్ని ఓదార్చింది తిరుపతమ్మ. తనని చూడవచ్చిన భక్తజనానికి వినయంగా నమస్కరించింది. మూడు సార్లు పెనుగంచిప్రోలు గ్రామప్రదక్షిణం చేసింది. మంగళవాద్యాలు మోగుతున్నాయి. గ్రామ ప్రజలు పసుపూ, కుంకుమలు అందిస్తుంటే అందరిని ఆత్మీయంగా పలకరించి, అందరి ఆశీస్సులు అందుకొన్నది తిరుపతమ్మ.

భర్త చెప్పులు గుండెలమీద పెట్టుకొని చితిపైన పడుకొన్నది. తాను దేవతనై ఇక్కడే అవతరిస్తానని. తనకు సేవలు చేసిన చెంబేటి పాపమ్మ సంతతి వారే తనకు పూజలు చేయాలనీ శాసించింది తిరుపతమ్మ.

తిరుపతమ్మ సజీవంగా అగ్నికి ఆహుతై పోతుంటే జనం హాహాకారాలు చేశారు. అందరూ చూస్తుండగానే అగ్ని జ్వాలలు చల్లారి కుంకుమ భరిణె పుచ్చుకున్న తిరుపతమ్మ తన చేతిని పైకి చూపి "దగ్ధమయ్యింది అశాశ్వతమైన భౌతిక శరీరమే గానీ, నేను కాదు.... నేను శాశ్వతం.... నన్ను నమ్మి పిలిచినవారి కష్టాలు కలకాలం తీరుస్తాను..." అని ప్రకటించింది.

వేలాది జనం ఈ దృశ్యాన్ని కళ్ళారా చూశారు. చల్లారిన గుండంలో ఆమె అస్థికలకోసం వేదికితే, మంగళసూత్రాలు, కుంకుమ భరిణె, పట్టు వస్త్రం పమిట అంచు చెదరకుండా కన్పించాయి.

సహగమనం జరిగిన ఆస్థలంలోనే పెనుగంచిప్రోలు గ్రామస్థులు అప్పటికప్పుడు చిన్న గుడిని నిర్మించి అందులో శ్రీ యంత్రాన్ని ప్రతిష్టించారు. ఆ రోజు నుంచీ తిరుపతమ్మ పేరంటాలు తిరుణాళ్ళు వైభవోపేతంగా జరగడం మొదలయ్యింది.

మరికొంత కాలానికి తిరుపతమ్మ బావగారు మల్లయ్య మరణించాడు. తోడికోడలు నడిచిన బాటలోనే తానూ నడుస్తానని, మల్లయ్య భార్య చంద్రమ్మ తన బిడ్డతో సహా సహగమనం చేసింది. తిరుపతమ్మతో పాటు చంద్రమ్మ పేరంటాలుకు కూడా అక్కడ నిత్య పూజలు జరుగుతున్నాయి.

ఒకసారి మద్దిరావమ్మ అనే జమిందారు భార్య, తన భర్త యుద్ధంలో మరణించిన సంగతి తెలిసి, పెనుగంచిప్రోలు వచ్చి అక్కడ సహగమనం చేసింది. ఆమె విగ్రహం కూడా తిరుపతమ్మ గుడిలో వుంచి పూజాదికాలు నిర్వహిస్తున్నారు.

తిరుపతమ్మ మహిమలు లోకానికి వెల్లడి కావడంతో భక్తుల తాకిడి ఎక్కువయ్యింది. ఆలయాన్ని పెద్దది చేయవలసిన అవసరం ఏర్పడింది. ఆ దశలో నందిగామ తాలూకా తహశీల్దారు మహమ్మదు మొయినుద్దీన్ గుడిని విస్తరించడానికి అనుమతి నిరాకరించి అడ్డంపడ్డాడు. అంతే! ఉన్నపళంగా అతని చూపు పోయింది. గుడ్డివాడై, తిరుపతమ్మ ఆగ్రహం వలన ఇది జరిగిందని పశ్చాత్తాపపడి, అనుమతి మంజూరు చేశాడు. వెంటనే చూపు కన్పించడం మొదలయ్యింది. ఆ తర్వాత మొయినుద్దీను అమ్మవారి భక్తుడయ్యాడు. రెండెకరాల భూమిని గుడికి ఈనాముగా ఇచ్చాడు.

పెనుగంచిప్రోలులో మాఘశుద్ధ పౌర్ణమికి, ఫాల్గుణ శుద్ధ పౌర్ణమికి తిరుపతమ్మ పేరంటాలు జాతర నిర్వహిస్తూ వుంటారు. ఈ తిరుపతమ్మ దేవాలయంలో అంకమ్మ, చంద్రమ్మ, మల్లయ్య, మద్దిరామమ్మ, పెద్దమ్మలతోపాటు ఒక పెద్ద పులి విగ్రహం కూడా ఇక్కడ పూజలందుకుంటోంది. ఈ గ్రామదేవతలందరికి కలిపి జాతర నిర్వహిస్తూ వుంటారు.

మొదటి రోజు పసుపు, కుంకుమ, నూతన వస్త్రాలు సమర్పించుకొంటారు. రెండోరోజు పెద్దపెద్ద కుండల్లో (ఘటాలు) బిందెల్తో కృష్ణా నది నుంచి పవిత్ర జలాలను తెచ్చి నింపుతారు. మూడో రోజున

అంకసేవ, పూలకప్పెర వంటి ప్రత్యేక సేవల్ని నిర్వహిస్తారు. ఆరాధన, నైవేద్యం అమ్మవారి కథను మహత్మ్యాన్ని వివరించుతారు. నాలుగోరోజు బోనాలు కార్యక్రమాన్ని బైట ప్రాంతాలనుంచి వచ్చిన భక్తులు, ఐదవరోజున స్థానిక భక్తులూ నిర్వహిస్తారు.

బోనాలు ఇచ్చుకునే భక్తులు నియమనిష్ఠలతో వుంటారు. ప్రధానంగా కమ్మ కులస్థులకు తిరుపతమ్మ ఇలవేల్పు అయినప్పటికీ, కుల బేధాలు లేకుండా పెద్ద సంఖ్యలో భక్తులు జిల్లా అంతటి నుంచి తరలి వస్తుంటారు.

కొమ్మరాజు వారి వంశీకులు తిరుపతమ్మ దేవాలయాన్ని నిర్మించినట్లు చెప్పారు. 1920-1940 మధ్యకాలంలో తిరుపతమ్మ పేరంటాలు జాతరలు ఇప్పటికన్నా భారీస్థాయిలో నిర్వహించేవారని తెలుస్తోంది. 1940 తర్వాత సంవత్సరానికి ఒకసారి నిర్వహిస్తున్నారు. తిరుపతమ్మతో పాటు ఆమె భర్త గోపయ్యని కూడా సమానంగా ఆరాధిస్తుంటారు.

విజయవాడ ఏలూరు ట్రంక్‌రోడ్ మీద వీరవల్లి గ్రామం వుంది. ఈ గ్రామంలో తిరుపతమ్మ గుడి, అందులో తిరుపతమ్మ గోపయ్యల విగ్రహాలు కూడా వున్నాయి.

ఫాల్గుణ శుద్ధ ఏకాదశి నుంచి, పూర్ణిమదాకా ఫిబ్రవరి మార్చి నెలల్లో అయిదు రోజుల పాటు ఇక్కడ కూడా పెనుగంచిప్రోలులో మాదిరే తిరుణాళ్ళు నిర్వహిస్తుంటారు. ప్రభలు కడతారు. ఊరేగింపు జరుపుతారు. కమ్మవారు, గొల్లవారు, కుమ్మరివారు ఈ దేవాలయానికి ముఖ్య పోషకులుగా వున్నారు.

## కానూరులో కూడా...

విజయవాడ దగ్గర కానూరులో కూడా తిరుపతమ్మ గుడి వుంది. లంబాడీ కులానికి చెందిన బణతు చంద్రయ్య అనే భక్తుడికి 1920లో తిరుపతమ్మ కలలో కన్పించి తన పేరుతో అక్కడ గుడిని నిర్మించమని

చెప్పిందట. చంద్రయ్య స్థితిమంతుడు కాకపోవడంతో ఉన్నంతలోనే, ఊరిచివర ఒక చిన్న పూరిగుడిసే నిర్మించి అందులో తిరుపతమ్మని ప్రతిష్ఠించాడు. ఈ గుడి కట్టిన దగ్గర్నించి గ్రామప్రజల కోర్కెలు తీరుతుండడంతో అమ్మవారి మహిమ ప్రసిద్ధిలోకి రాసాగింది. కాలక్రమంలో గుడికి ఆదాయం కూడా గణనీయంగా పెరిగింది. దేవాలయాన్ని విస్తరించి పెద్ద గుడి నిర్మించారు. పెనుగంచిప్రోలులో తిరునాళ్ళు జరిగే సమయంలోనే కానూరులో కూడా ఘనంగా తిరుపతమ్మ తిరుణాళ్ళు జరుపుతున్నారు.

అలాగే, కంకిపాడు గన్నవరం బస్సు రూటులో తెన్నేరు గ్రామం వుంది. ఈ గ్రామంలో శ్రీమంతులైన కమ్మవారు తిరుపతమ్మ, గోపయ్యల దేవాలయం నిర్మించి ఏటేటా జాతర నిర్వహిస్తున్నారు. 1930 నుంచి ఈ గుడిలో జాతరలు జరుగుతున్నాయి. కులభేదాల్లేకుండా భక్తులు పాల్గొంటూవుంటారు.

## తుంగపల్లెమ్మ

అవనిగడ్డ దగ్గరగా మాచవరం గ్రామం వుంది. అక్కడ తుంగపల్లెమ్మ జాతర మార్గశిర మాసంలో నిర్వహిస్తుంటారు. నాలుగు నుంచి ఏడు రోజుల దాకా ఈ ఉత్సవాన్ని జరుపుతారు. ఉత్సవం చివరి రోజు గొర్రెలు, మేకలు, కోళ్ళు బలి ఇస్తుంటారు. కాపు కులానికి చెందినవారు ఈ గ్రామ దేవతకు ముఖ్య అర్చకులు.

## తుమ్మలమ్మ తల్లి

బందరు దగ్గర చెన్నూరు గ్రామానికి అధిదేవత తుమ్మలమ్మవారు. ఆమెకు అక్కడ చిన్న గుడి వుంది. తుమ్మలమ్మకు విడిగాగానీ, అంకమ్మతో కలిపిగానీ జాతరలు నిర్వహిస్తూ వుంటారు.

వానలు సరిగా కురవనప్పుడు, పంటలు పండనప్పుడు, కరవు పరిస్థితులు ఏర్పడినప్పుడు గ్రామదేవతని తృప్తి పర్చడం కోసం జాతరలు చేస్తుంటారు.

## నాంచారమ్మ తల్లి

తెలుగునాట నాంచారమ్మ ప్రసిద్ధ ప్రాచీన గ్రామదేవత. కృష్ణాజిల్లాలో నాంచారమ్మ తల్లి సంబరాలు, ఉత్సవాలు, జాతరలు జరగని ఊరంటూ వుండకపోవచ్చు అనేకచోట్ల నాంచారమ్మతల్లికి గుడులున్నాయి.

ఉయ్యూరు హరిజనవాడలో పాల్గుణ శుద్ధ త్రయోదశి నుంచి మూడు రోజులపాటు ఫిబ్రవరి మార్చి నెలల్లో నాంచారమ్మ జాతర జరుపుతారు. నాంచారమ్మ గుడిలో భారీ ఉత్సవం జరుగుతుంది.

కోడూరు దగ్గర మందపాకల గ్రామంలో కూడా నాంచారమ్మ గుడి వుంది. చైత్ర శుద్ధ పౌర్ణమి రోజున మార్చి, ఏప్రియల్ నెలలో ఇక్కడ జాతర జరుగుతుంది. షుమారుగా 1850 నుంచి ఇక్కడ నాంచారమ్మ తల్లి జాతర జరుగుతున్నట్లు తెలుస్తోంది. కాపు కులస్థులు ఈ దేవతని ఇక్కడ ప్రధానంగా అర్చిస్తుంటారు.

తెలంగాణాలో 'నాంచారమ్మ' అనే పేరంటాలమ్మ తల్లికి జాతరలు కొలుపులు చేస్తుంటారు. ఈ నాంచారమ్మ ఒక ఎరుకల స్త్రీ అనీ, లంబాడీల చేతిలో అత్యాచారానికి గురై మరణించిందనీ, బాలమైసమ్మ ఆమెను దేవతగా చేసిందనీ అంటారు. ఈమె ఆ లంబాడీ తండాను శపించగా వాళ్ళంతా నశించిపోయారు. నాంచారమ్మ గోల్కొండ సుల్తాన్‌కు కలలో కనపడి తనకు గుడి కట్టించి జాతర జరిపించమని కోరిందట. సుల్తాన్ ఆమె కొరకు గుడి కట్టించి జాతరలు చేయించి అమ్మవారిని సంతృప్తి పరిచినట్లు ఈ కథ చెప్తోంది. అయితే, కృష్ణా జిల్లాలో పూజలందుతున్న నాంచారమ్మ తెలంగాణాలోని నాంచారమ్మ ఒకరే అవునో కాదో తెలియదు.

## నీరమ్మ తల్లి

కృష్ణాజిల్లా కైకలూరులో నీరమ్మ తల్లి జాతర జరుపుతూంటారు. వానలు కురవనప్పుడు. నీటి ఎద్దడి ఏర్పడి పంటలు దెబ్బతింటున్నప్పుడు, కరువు పరిస్థితులు ఏర్పడినప్పుడూ 'నీరమ్మ' తల్లిని కొలుస్తుంటారు. ప్రభ కట్టి ఊరేగింపు జరుపుతారు.

## నూకాలమ్మ తల్లి

చింతలపాడు ఒకప్పుడు ముక్త్యాల జమిందార్లకు రాజధానిగా వుండేది. నూకాలమ్మ ఈ ఊరికి గ్రామదేవత. అక్కడ నూకాలమ్మ ఆలయం వుంది. పుష్యమాసంలో మూడు రోజులపాటు నూకాలమ్మ జాతర జరుపుతుంటారు.

వైశ్యులు, కమ్మవారు ఈ దేవాలయానికి ముఖ్యపోషకులు. చుట్టుపక్కల గ్రామాల నుంచి కూడా జోరుగా భక్తులు తరలి వస్తుంటారు. మొక్కుబడులు చెల్లించుకొంటూ వుంటారు.

## పుట్లమ్మ తల్లి

బెజవాడ - బందరు రైలు మార్గంలో దోసపాడు రైల్వేస్టేషన్ దగ్గర జనార్ధనపురం అనే చిన్న గ్రామం వుంది. ఇక్కడ పుట్లమ్మ, గొంతెమ్మ గంగానమ్మల గుడులున్నాయి.

1945 నుంచి ఈ గ్రామంలో పుట్లమ్మ జాతర నిర్వహిస్తున్నారు. జాతరని ఘనంగానే నిర్వహిస్తారు. జంతు బలులు జోరుగా జరుగుతాయి.

## పెద్దమ్మ తల్లి

బందరు సమీపంలో 'పెడన'కు పెద్దమ్మ గ్రామదేవత. అక్కడ ఆమెకు గుడి వుంది. మార్గశిర శుద్ధ పంచమి నుంచి పూర్ణిమ వరకూ నవంబరు, డిసెంబరు, మాసాలలో పదకొండు రోజులపాటు జాతర ఘనంగా జరుపుతుంటారు. అన్ని కులాల వారూ పాల్గొంటారు.

విస్సన్నపేట దగ్గర రెడ్డిగూడెం పక్కన రాఘవాపురం అనే గ్రామంలో కూడా పెద్దమ్మతల్లి దేవాలయం వుంది. ఘనంగా జాతరలు జరుగుతుంటాయి అక్కడ.

పెద్దమ్మతల్లి పేరంటాలు జీవిత చరిత్ర పూర్తిగా తెలియదు. ఆమె భర్త సత్తిరెడ్డి మరణించిన తర్వాత సహగమనం చేసి పేరంటాలమ్మ

అయ్యింది. సాగుమానం చెయ్యడానికి ముందే అనేకసార్లు ఆమె తన మహత్యాలు చూపింది. జోరున కురుస్తున్న వానలో ఆమె నడుస్తుంటే ప్రకృతి గొడుగు పట్టినట్లు, ఆమె పైన చినుకు కూడా పడకపోవడం వంటి మహిమలు ప్రదర్శించింది. నిప్పు కణికలు చేత్తో పుచ్చుకుని బంతులాడేది.

రాఘవపురం పెద్దమ్మతల్లి దేవాలయంలో ఆమె పక్కన సత్తిరెడ్డి కూడా పూజలందుతున్నాడు. ఈ గుడిలో ఒకప్పుడు రెండున్నర అడుగుల ఎత్తున కంచు రేకుపైన పెద్దమ్మ, సత్తిరెడ్డిల విగ్రహాలు చెక్కివుండేవి. ఇద్దరూ నిలబడి వుండి, పైన రెండు పక్షులు ఎగురుతున్నట్లు చెక్కివుండేవి. పెద్దమ్మ ఎడమ చేతిలో కమండలం, కుడిచేతిలో ఒక పండు పుచ్చుకుని నిలబడి వుండేది.

ఈ కంచురేకు విగ్రహాన్ని ఒక దొంగ దొంగిలించుకు పోయాడు. కానీ, దొంగతనం చేసిన తర్వాత ఆ దొంగకు అన్నీ కష్టాలే రావడంతో తప్పు తెలుసుకొని తను సంపాదించిన డబ్బంతా తెచ్చి అమ్మవారికిచ్చి చెంపలేసుకున్నాడు. ఆ తర్వాత మరో కంచురేకుపైన అమ్మవారి విగ్రహము, సత్తిరెడ్డి విగ్రహమూ చెక్కించి పునఃప్రతిష్టించారని చెప్తారు.

మొదటి కంచురేకుమీద నిలబడివున్న విగ్రహాలు, ఈ రెండో కంచురేకు మీద కూర్చుని వున్న రూపాలుగా మార్చారు. ఇద్దరూ ఎడమ చేతుల్లో పూలమాలలు వుచ్చుకొని కుడి చేతుల్తో భక్తుల్ని ఆశీర్వదిస్తుంటారు. రెడ్డి కులస్థులు ఈ గుడికి ప్రధాన పోషకులుగా వున్నారు.

## పోచమ్మ తల్లి

స్ఫోటకం వ్యాధికి అధిదేవత పోచమ్మ లేదా పోశమ్మ తల్లి. కాళికాదేవి రూపంలో పోచమ్మ వుంటుంది. స్ఫోటకం (మశూచికం) కొంతమందిలో ప్రాణాంతకంగా వచ్చే వ్యాధి. కొంతమందికి శాశ్వతమైన అంగవైకల్యం కనిపిస్తుంది. స్ఫోటకం వచ్చిన వ్యక్తికి పోచమ్మ పోసిందని అంటూంటారు గ్రామీణులు. ఊళ్ళో అమ్మవారుందని భయపడి ఊరొదిలి పారిపోయినా

అమ్మవారు ఊరుకోదనీ, ఎక్కడికి వెళ్ళినా వెంటాడి మరీ పోచమ్మ పోస్తుందనీ జనం నమ్మకం.

పోచమ్మ దేవతకు ఉత్సవాలు చేసేప్పుడు బోనాలు పెట్టుకొంటారు. బలులిస్తారు. కొలుపులు కొలిచి అమ్మవారి కథలు చెప్పుకుంటారు. పోచమ్మ, ఎల్లమ్మ, మల్లన్న కథలు చెప్పించుకుని ప్రత్యేకంగా కొలుచుకుంటారు.

అదిలాబాదు జిల్లాలో పోచమ్మని పోలమ్మగా ఆరాధిస్తారని డా॥ రావి ప్రేమలత రాశారు. అక్కడ పోచమ్మ గుళ్ళలో స్త్రీ పూజారులు వుంటారు. పోచమ్మలు కీర్తి (నల్ల) పోచమ్మ, ఎర్ర పోచమ్మ అని ఇద్దరున్నట్లు జనం భావిస్తారు. ఎర్ర పోచమ్మ కంటే నల్ల పోచమ్మ ఎక్కువ భయంకర స్వరూపిణి. అధిక మహిమగలది. బహుశా స్ఫోటకం వ్యాధి తీవ్రంగా వచ్చినప్పుడు నల్ల పోచమ్మ అనీ, తేలిగ్గా పోసినప్పుడు ఎర్ర పోచమ్మ పోసిందని అనుకుంటూ వుంటారు. పిల్లలకు పోస్తే బాల పోచమ్మ అనీ, పెద్దలకు పోస్తే పెద్దపోచమ్మ అని కూడా అంటారు.

శివుడితో పోరాడి గెలిచిన, స్త్రీ దేవతలలో పోచమ్మ కూడా ముఖ్య దేవత. చివరకి శివుడు కూడా పోచమ్మ పండుగలు చేయడానికి అంగీరించినట్టు ఈ అమ్మవారి కథలు చెప్తున్నాయి.

జనం ఉపవాసం వుండి, పప్పు, బియ్యంతో బోనం వండి, బోనపు కుండను పసుపు కుంకుమలతో అలంకరించి, హారతులు పట్టి గుడికి తీసుకువెళతారు.

పార్వతి కోరిక మీద పరమేశ్వరుడు పోచమ్మకి అడవి మహామునితో వివాహం చేశాడని, ఈ ముని అడవి ప్రాణులన్నిటికి అధిపతి అనీ, అతను బేస్తువారం బయలుదేరి శుక్రవారం పోచమ్మ దగ్గరకు వస్తాడని కథ. కానీ పరమేశ్వరుడి శాప ప్రభావం చేత పోచమ్మకు దాంపత్య సుఖం వుండదని. శివుడికి ప్రతిశాపంగా మళ్ళీ జన్మలో తల్లిగా పుట్టి బ్రహ్మదాసి కొండ చుట్టున్న కంచెలోకి నీ గంగావులు వస్తే, ఆహారంగా వాటిని తినేస్తాను - అన్నదట!

పోచమ్మ కథలు ఇలాంటివి అనేకం వున్నాయి. ఇవన్నీ స్త్రీ దేవతల ప్రాధాన్యతని చాటి చెప్పేవే! శివుడు విష్ణువు వంటి పురుష దేవతలకన్నా స్త్రీ దేవతలైన గ్రామదేవతలే అధికులనే విధంగా ఈ కథలు కన్పిస్తాయి.

పోచమ్మను వేడుకొంటూ ఆమెమీద గల భక్తితో కష్టాలేవీ రాకుండా కాపాడమని ప్రార్థిస్తూ పల్లెవాసులు పాడుకొనే పాట.

మాయమ్మ పోశమ్మ మము బ్రోవుమమ్మ, నీమాయ ఎన్నంగ ఎవరీతరమమ్మ

బమ్మాదిదేవతలు ఒడగూడిరమ్మ, నీ తోడ మైసాసుర పడవేసిరమ్మ

గడియా సంసారాలు కడతేర్చవమ్మా, నీ పండుగలు జేయకోరే మాయమ్మ

నురగ తానంబులు జేయిస్తిమమ్మా, వెయిగండ్ల దీపాలు వెలిగింతుమమ్మా

పచ్చన్నీ పందిర్లు వేయింతుమమ్మ, పాటిదీటిలతో వెలిగింతుమమ్మ

వెండి కన్నులు నీకు చేయింతుమమ్మ, మాయమ్మ పోచమ్మ మము బ్రోవుమమ్మ

నీ మాయ ఎన్నంగ ఎవరీతరమమ్మ.

## పోలమ్మ దండకం

బోగాడ మల్లకవి అనే 19వ శతాబ్దపు కవి పోలమ్మ దండకం వ్రాశాడు.

"శ్రీమత్పయోజాక్షీ దాక్షాయణీ పావనీ పార్వతీ
శాంకరీ శాంభవీ లోకమాతా కృపాపాంగ నేత్ర
ధరిత్రీ వశీకర్త్రి శ్రీకరీ నీకు నే మ్రొక్కెదన్
వేడ్క నా జిహ్వకున్ దోడుగా నీడగావే
అంటూ ప్రారంభమైన స్తుత్యాత్మకమైన ఈ దండకం

"ఇంతి చామంతి పూబంతి పంతంబుగా జాకం నేర్తురే సొక్కుచూ

జోలుచున్ ఆడుచున్ బాడుచున్ గొర్రెలన్ గోళులన్ బందులన్ దున్నలన్ నిక్కముగా నీకు జాతరక జేతురే గొంతిరో పల్లభూపాల పట్నంబు రక్షించి యా బొగడ మల్లకవి రక్షించి యా పల్లవాధీశు రాజ్యంబుపై భారముంచి ఆది దుర్గ నమోదేవి తుభ్యం నమో దేవి తుభ్యం నమస్తే నమస్తే నమః అంటూ అంతమవుతుంది.

## పోతురాజు

పోతురాజు గ్రామదేవతలకు సోదరుడుగా కన్పిస్తాడు. సహాయకుడు కూడా! పోతురాజుకి ప్రత్యేకంగా అర్చకులుగాని, జాతరలుగాని, కొలుపులుగాని వుండవు.

కానీ గ్రామదేవతలతో సమానంగా గౌరవించబడ్డాడు. దైవ కార్యాలలో పాల్గొనడు. పనిచెయ్యని సోమరుల్ని మనవాళ్ళు "పనికి పోతురాజు" లాంటి వాడని వెక్కిరిస్తుంటారు.

పోతరాజు విగ్రహంలో ఒక చేతిలో కత్తి, రెండో చేతిలో నిమ్మకాయ తొమ్మిది గాజులు వుంటాయి. నిలబడివుంటాడు. కాళ్ళ దగ్గర కోడిపుంజు బొమ్మ వుంటుంది.

పోతురాజు అమ్మవారి గుడికి రాడు. అందుకని ముఖద్వారానికి ఎదురుగా పోతురాజు విగ్రహాన్ని ప్రతిష్టిస్తారు. అంత అవకాశం లేనివాళ్ళు ఒక రాయినిగాని, సన్నటి పొడవైన కర్రగాని పోతురాజుగా భావించి ప్రతిష్టిస్తారు.

ప్రాచీన గ్రామదేవతలు పోచమ్మ, ఎల్లమ్మ, పోలేరమ్మల కథల్లో పోతురాజు వాళ్ళ సోదరుడుగానే కన్పిస్తాడు. పార్వతిదేవికి ఏడుగురూ ఆడపిల్లలే కనక ఒక్క మగపిల్లవాణ్ణి అడిగితే పరమేశ్వరుడు ఆమెకు పోతురాజును ప్రసాదించాడని కథ. సప్తమాతృకలకు సంరక్షకుడిగా పోతురాజును సృష్టించి ఆదిదంపతులు నిష్క్రమించినట్లు ఒక కథ వుంది.

పాండవులు అరణ్యవాసానికి వెళ్ళినప్పుడు తమ కోటల్ని రక్షించడానికి

పోతురాజును నియమించారనీ, మహాపర్వతం అంత అన్నం రాశులుగా పెట్టి, తాడిచెట్టంత ఎనుబోతును ఇస్తే కాపలాకాయడానికి పోతురాజు అంగీకరించాడనీ, అరణ్యావాసం చేసి వచ్చాక పోతురాజుకి అన్నపుముద్ద పెట్టి మేకపోతుని ఇచ్చారని జానపద, మహాభారత కథలో వుంది. "పోతు"నీ, అన్నపు "రాసి"నీ కోరాడు కాబట్టి పోతురాసి పోతురాజు అయ్యాడని ఈ కథనిబట్టి అంటుంటారు.

నెల్లూరు పోతురాజు విగ్రహంలో ఒక ప్రత్యేకత వుంది. "మోహిని"ని కామించి ఈ పోతురాజు పెళ్ళాడమని అడిగితే, మీ అమ్మనాన్నల తలకాయలు తెచ్చి చూపిస్తే పెళ్ళాడటానికి అంగీకరిస్తానని అన్నదట. పోతురాజు అలానే తెస్తే దానికి మోహిని, "ఎవరు ఏది అడిగినా చేస్తావు నువ్వు - రేపు ఎవరేనా అడిగితే నన్ను కూడా చంపుతావు" అనుకొంటూ వెళ్ళి పోయిందట! ఒకచేతిలో కత్తి రెండో చేతిలో తండ్రి శిరస్సు పుచ్చుకొని, తల్లి శిరస్సును కాలి కింద తొక్కిపెట్టి ఉత్తిష్ట భంగిమలో నిలబడిన నెల్లూరులో పోతురాజు విగ్రహం వుంటుంది.

ఒకసారి కోపంవచ్చి భీముడు పోతురాజుపైన యుద్ధమాడి ఓడించాడనీ, కాళ్లమీద పడి పోతురాజు క్షమించమని అడిగాడనీ, అందుకు గుర్తుగా భీముడు తన కాలి అందెని పోతురాజుకు ఇచ్చి, కలియుగాంతం దాకా దీన్ని ధరించి నిలబడివుండాలని అదేశించాడని ఇంకో కథ ప్రచారంలో వుంది.

## పోలేరమ్మ తల్లి

ప్రాచీన గ్రామ దేవతలలో పోలేరమ్మ ముఖ్యదేవత. రుద్రుడు రాక్షసులతో యుద్ధం చేస్తున్నప్పుడు, ఒక్కో రాక్షసుని రక్తపు మడుగులోంచి రెట్టింపు రాక్షసులు పుడుతున్నారు. తెగిన రాక్షసుల శిరస్సులన్నీ మళ్ళీ అనుసంధానం అయి వాళ్ళు బతుకుతున్నారు.

ఇది గమనించి శక్తి స్వరూపిణి - "ముందర జూసిన మున్నూరు కన్నులు, వెనుక జూచిన వేనూరు కన్నులు, ప్రక్కన జూచిన పదున్నూరా

కన్నులు కలిగి, భద్రకాళి రెండు ఒక చేతిలో, చక్రం మరియొక చేతియందు, గజశూలము మూడవ చేతిలో , అంబలి నాలుగవ చేతిలో పట్టుకొని కనకాంబరము చీర ధరించి కాంతావళి రవికెను తొడిగి...." తన నాలుకను పన్నెండు ఆమడల మేర పరిచింది. మరుక్షణమే రాక్షసులు శివుడి చేతిలో నశించి పోయారట.

శంకరుడు పోలేరమ్మనే నక్కను వాహనంగా చేసుకొని ఓరుగల్లు పట్టణానికి దేవిగా పాలించమని ఆనతిచ్చాడనీ, ప్రతాపరుద్రుడు పోలేరమ్మని భక్తితో ఆరాధించాడని కథ.

అయితే, ఈ కథకి కొంత కొసమెరుపు వుంది. మధ్యలోవచ్చిన దేవతతో మనకేమిటని కాకతీయ ప్రభువులు పోలేరమ్మని మరిచిపోయి, ఆమె గుడిని కూలగొట్టి శివాలయం కట్టించారట. హరహర అంటున్న వారేగానీ, పోలేరమ్మ తల్లి అంటున్న వాళ్ళు లేరని గమనించి, ఆగ్రహించి, అమ్మవారు పోతురాజు చేత ఊరంతా మల్లెపూలు చల్లించిందట. ఆటలమ్మ, చెంపాలమ్మ, నాగులమ్మ, నూగ్నుమ్మ, ఇలాంటి వ్యాధులు వచ్చి జనం తట్టుకోలేక, పరమేశ్వరుని ప్రార్థించారు. అయినా ఫలితం కన్పించనప్పుడు ఇదంతా మనం మరచిపోయిన పోలేరమ్మ ఫలితమేనని జనం గ్రహించారు. కానీ, రాజు గ్రహించలేదట. అందుకని అమ్మవారు రాజు మీద బస్తాడు మల్లెపూలు చల్లించిందట. రాజుకూడా తీవ్రమైన జ్వరంతో మంచాన పడినా హరహర అనే అన్నాడు గానీ పోలేరమ్మ తల్లి అనలేదట. పైగా ఆడ దేవతలకు ఉత్సవాలు ఏమిటీ - అని హేళన చేశాడట.

ఈ కథలో శైవమత ప్రాబల్యం, గ్రామదేవతల ఆరాధనా ప్రాశస్త్యాలు, మధ్యయుగాలలో స్త్రీ దేవతలు ఎలా బయల్దేరారో మనకి స్పష్టంగా అర్థం అవుతుంది.

కృష్ణాజిల్లాలో ఇంచుమించు ప్రతి గ్రామంలోను పోలేరమ్మను కొలుస్తారు. గంగానమ్మ, ముత్యాలమ్మ, గంటాలమ్మలతోపాటు పోలేరమ్మని కూడ కలిపి ఎక్కువచోట్ల జాతరలు చేస్తుంటారు. వానలు కురవక ఏరులు ఎండిపోయి కరువు తాండవించినప్పుడు పోలేరమ్మని తృప్తి పరచుకోవడానికి

జాతరలు చేసి గొర్రెల్ని మేకల్ని బలి ఇచ్చుకొంటారు. గని అత్కూరు, పురుషోత్తమపట్నం.... ఇలా చాలా వూళ్ళల్లో పోలేరమ్మ కొలువులు జరుగుతూవుంటాయి.

## బతుకమ్మ తల్లి

కృష్ణాజిల్లాలో అనేక చోట్ల బతుకమ్మ పండుగ జరుపుకొంటూ వుంటారు. స్త్రీలలో ఒకరి మీద ఒకరికి ప్రేమానురాగాలతో కలిసి జీవించాలని, అత్తాకోడళ్ళు, వదినా, ఆడపడుచులూ, ఇరుగూపొరుగులూ..... ఆడవాళ్ళందరి మధ్య ఈర్ష్యాద్వేషాలు కలగకూడదని బతుకమ్మ కథ చాటిచెప్తుంది. అందుకని ఊళ్ళో ఆడవాళ్ళంతా కలిసి వేడుకగా బతుకమ్మ పండుగని జరుపుకొంటారు.

బతుకమ్మకథ తెలంగాణాలో జరిగినప్పటికీ కృష్ణాజిల్లాలోకూడా ఆమెని ఆరాధిస్తుంటారు. వరుసగా పుట్టిన పిల్లలంతా చనిపోయి, ఏ దేవత వరం పుణ్యమో ఏడో కాన్పుకు పుట్టిన ఆడపిల్ల బతికింది. బతికిన ఆ పిల్లకి బతుకమ్మ అనిపేరు పెట్టుకున్నారు తల్లిదండ్రులు. బతుకమ్మ తర్వాత ఇంకో మగపిల్లాడు కూడా పుట్టాడు.

బతుకమ్మకు పెళ్ళయింతర్వాత కొంత కాలానికి తల్లిదండ్రులు మరణించారు. అత్తారింట్లో సుఖంగా కాపురం చేసుకొంటున్న బతుకమ్మకి తమ్ముణ్ణి పలకరించాలని కోరిక కలిగి పుట్టింటి కెళ్ళింది.

ఒక రోజు బతుకమ్మ, తమ్ముడి భార్యా కలిసి తెల్లవారు ఝామున నదికి స్నానానికి వెళ్ళారు అక్కడ గాలికి ఇద్దరి చీరలూ కలిసిపోయాయి. ఒకరి చీర ఒకళ్ళు కట్టుకున్నారు. తగువుపెట్టుకోవడానికి ఇంతకు మించిన అవకాశం ఇంకొకటి వుండదు. మాట మాట పెరిగింది. "నేను ఈ ఇంటి ఆడపడుచుని" అంది బతుకమ్మ. మర్యాదలు పొందడం ఆమె హక్కు "నేను ఈ ఇంటి కొడల్ని" అంది మరదలు. ఇంటి మీద పెత్తనం ఆమె హక్కు. చిలికి చిలికి గాలివానైంది. ఆ కోపంలో మరదలు బతుకమ్మ పీక నులిమేసింది. అక్కడికక్కడే ప్రాణాలు వదిలింది బతుకమ్మ. ఏం చెయ్యాలో తోచలేదు మరదలికి.

తెల్లవారు ఝామున చీకటి కావడంతో అపుడు ఎవరూ లేరు. ఎవరికీ ఈ సంఘటన గురించి తెలియదు. చెకచెకా నది ఒడ్డున ఇసకలో పెద్ద గొయ్యితీసి, అందులో బతకమ్మ శవాన్ని పాతిపెట్టి ఏమి ఎరుగని దానివలె ఇంటికి వెళ్ళిపోయింది.

తనను ఇంటికి తీసుకు వెళ్ళమని బతుకమ్మ వేడుకొంటున్నట్లు ఆ రాత్రి కల వచ్చింది ఆమె భర్తకి. ఎందుకిలాంటి కలవచ్చిందో ఆయనకి అర్థం కాలేదు. చెకచెకా అత్తగారింటికి బయల్దేరాడు. దారిలో ఈ సంఘటన జరిగిన చోట నీటి కోసం ఆగాడు. సాయం సమయం అయ్యింది.

అక్కడ ఓ తంగేడు మొక్క చక్కని బంగారు రంగు పూలుపూసి ఆయన దృష్టిని ఆకర్షించింది. ఈ పూలు కోసి, భార్యకు తీసుకొని వెళ్దాం అనుకొని ఒక పువ్వును కొయ్య బోతుండగా.... ఆ పువ్వు తానే బతుకమ్మనని చెప్పింది. పాపిష్టి వదిన పాతి పెట్టి పోయిందని జరిగిన కథంతా వివరించింది.

విస్తుబోయిన భర్తతో జరిగిన సంగతి అంతా చెప్పింది బతుకమ్మ.... ఏడాది కొకసారి తంగేడుపూలతో బతుకమ్మని పేర్చి గౌరమ్మతో పూజించి చెరువు గట్టున ఆడి, నీళ్ళలో విడిచిపెట్టాలని కోరింది. ముత్తయిదువలతో ఆమె కోరిక ప్రకారమే చేయించాడు భర్త. తమ్ముడి కుటుంబం సర్వనాశనం అయిపోయింది. అప్పటి నుండి బతుకమ్మ పండుగని అసూయాద్వేషాలు లేకుండా ఆడవాళ్ళు సఖ్యతగా మెలిగేందుకోసం ఒక ఆచారంగా జరుపుకొంటున్నారు.

## బాలసన్యాసమ్మ తల్లి

కొందరికి చిన్నప్పుడు తల్లిదండ్రులు ఏ ఉద్దేశ్యంతో పేర్లు పెట్టినా, వాళ్ళు పెరిగి పెద్దయ్యాక వాళ్ళ జీవితం పేరుకు తగ్గట్టుగానే వుంటుంది.

విశాఖపట్నం జిల్లా దివిలికట్టు గ్రామంలో దాలి నాయుడు అనే గాజుల కాపు కులానికి చెందిన సంపన్నుడుకి ఏడుగురు మగపిల్లల తర్వాత ఒక ఆడపిల్ల పుట్టింది. నిజానికి లేకలేక కల్గిన ఆ ఆడపిల్ల గారాబాల

పట్టిగా పెరిగి వుండాల్సింది కానీ, తను పుడుతూనే తల్లిని కోల్పోవాల్సి వచ్చింది. తండ్రి ఆమెకి బాలసన్యాసమ్మ అనే పేరు పెట్టాడు. మరో పెళ్ళి చేసుకుని బాలసన్యాసమ్మ పెంపకం సంగతే మరచి పోయాడు.

పెద్దన్న రామన్నకి ఈ చిట్టి చెల్లెలంటే ఎంతో ఇష్టం. అతను అతని భార్య పాపమ్మ బాలసన్యాసమ్మని కన్నకూతురులా పెంచసాగారు. వయస్సు వస్తున్నకొద్దీ బాలసన్యాసమ్మ బంగారు రంగు మేనిఛాయతో నిండు పున్నమి చంద్రుడిలా రూపలావణ్యాలతో అందంగా తయారైంది.

మేనత్త దాలమ్మ ఒకసారి బాలసన్యాసమ్మను చూసింది. ఆమె పెద్దకొడుకులు ఇద్దరికీ పెళ్ళిళ్ళయ్యాయి. మూడో కొడుకు చెంచన్నకి బాలసన్యాసమ్మని ఇప్పించి బాల్య వివాహం చేయించింది.

బాలసన్యాసమ్మ ఇంకా ఈడేరలేదు కాబట్టి, యుక్త వయస్సు వచ్చే వరకూ పుట్టింటిలోనే వుంచుకొంటామని అన్నగారు చెప్పాడు. అత్తగారు అందుకు అంగీకరించింది.

పెళ్ళి అయినా, చిన్న పిల్లే కదా.... వీధిలో గంగిరెద్దుల ఆట జరుగుతుంటే, సవతి తల్లి కొడుకుని ఎత్తుకొని వీధివాకిట్లో నుంచుని వినోదం చూస్తోంది. ఇంతలో ఆ పిల్లాడు ఎందుకో ఏడ్చాడు. సన్నాయి మేళానికి బెదిరి వుంటాడు. సవతి తల్లి పరుగున వచ్చి, బిడ్డని ఏడ్పించిందని, నష్ట జాతకురాలనీ తెగతిట్టి నానా హింస పెట్టింది.

సవతి తల్లి ప్రవర్తన చూశాక ఇంక పుట్టింటిలో వుండటం తనకు మర్యాద కాదని అర్థంచేసుకొంది. అన్నలు ఇంటికి రాగానే, వెంటనే తనని అత్తవారింటికి పంపించేయమని అడిగింది. ఎందుకంత అర్థాంతరంగా పట్టుబట్టి అడుగుతున్నదో అన్నలకు అర్థం కాలేదు. బాలసన్యాసమ్మ కూడా, సవతితల్లి మీద చాడీలు చెప్పడానికి ఇష్టపడలేదు.

పెద్దన్నగారు చెల్లెలిమాట కాదనలేక చీర సారెలు పెట్టి 25 గ్రాములు ఆభరణం ఇచ్చి అత్తవారింట్లో దిగవిడిచి వచ్చాడు. ఈలోగా బాలసన్యాసమ్మ భర్త చెంచన్నకి ఈస్టిండియా కంపెనీలో మంచి ఉద్యోగం వచ్చింది. భార్య ఇటు కాపురానికి వచ్చింది. భర్త అటు మచిలీపట్నానికి కొలువుకోసం బయల్దేరాడు.

ఇలా కొన్నేళ్ళు గడిచిన తర్వాత అత్తారింట్లోనే ఈడేరింది బాలసన్యాసమ్మ. అమె సౌందర్యం మరింత ఇనుమడించసాగింది. భర్త బందరులో వుండి పోవడంతో ఆమె అందం అడివిలో కాసిన వెన్నల చందం అయ్యింది.

అప్పటి దాకా బాలసన్యాసమ్మ చిన్నపిల్లే. అయినా తోడికోడళ్ళు తమతోపాటు ఇంటి పనుల్లో తనవంతు పని చెయ్యాలని వత్తిడి చేయసాగారు. అప్పటి దాకా ప్రేమగా చూసుకున్న అత్తగారు కూడా పేడపని పిడకలపని చెయ్యాలని ఆదేశించేసరికి బాలసన్యాసమ్మకి దుఃఖం వచ్చింది. "నా వంతు పని కింద మా అన్నల్ని అడిగితే పనిమనుషుల్ని పంపుతారు..." అంది. చిన్నపిల్ల తెలిసీ తెలియక అంటోంది లెమ్మని అత్తగారు, తోడికోడళ్ళు సరిపెట్టుకోలేక పోయారు. ఇది మెట్టినింటికి అవమానంగా భావించింది అత్తగారు. మాకన్న నీ అన్న స్థితిమంతుడా.... అంటూ పుట్టగానే తల్లిని పోగొట్టుకున్న నష్టజాతకురాలివని తిట్టి పోసింది. ధనమదంతో మాట్లాడుతోందనీ, ఏడు దొడ్ల పేడ, ఏడు సావిళ్ళ ఊడుపు, ఏడువాకిళ్ళ కళ్ళాపు సన్యాసమ్మ స్వయంగా చెయ్యాలని ఆదేశించింది. కూడు నీళ్ళు ఇవ్వకుండా మాడ్చడం మొదలుపెట్టింది. ఎవరైనా జాలిపడి సాయపడితే వాళ్ళని కూడా దండించింది అత్తగారు.

అప్పటిదాకా కుందనపు బొమ్మగా పెరిగిన తనకి ఈ అకారణ కష్టాలేమిటో అర్థం కాలేదు సన్యాసమ్మకి. ఆధ్యాత్మిక శక్తితో మనసుని దృఢతరం చేసుకోసాగింది. మరిది అప్పన్న వదినమీద జాలిపడి కాసిని పాలు అందించి సానుభూతి చూపబోయాడు. అది తెలిసి అత్తగారు కొడుకుని నిలదీసి వదిన మీద కన్నేశావా... అనడిగింది. ఈ సంఘటనతో సన్యాసమ్మ మరీ కృంగిపోయింది. భగవంతుడే తనకు రక్షకుడనుకొంది. దైవశక్తితో మనసుకు కావలసిన బలాన్ని నింపుకోసాగింది.

అత్తారింట్లో సన్యాసమ్మ బాధలు అన్నగారు రామినీడుకి తెలిశాయి. ఆయన అగ్గిగుగ్గిలం అయి వీరావేశంతో వచ్చాడు. ఈ సంగతి తెలిసి బాలసన్యాసమ్మ అన్నని శాంతింపచేసింది. తనను బాగానే

చూసుకొంటున్నారని, కష్టాలేమీ లేవని సమర్థించింది. చెల్లెలికి కొంచెం డబ్బిచ్చాడు అన్న. అది కూడా లాక్కుని మళ్లీ కష్టాలు పెట్టడం మొదలుపెట్టింది అత్తగారు. కష్టాలతో పాటు నీలాపనిందలు కూడా ఎక్కువ కావడంతో బాలసన్యాసమ్మ తనకు అన్న ఇచ్చిన ఇంట్లో తలుపులు బిగించుకుని పడుకొంది. కోడలు ఇంట్లోంచి లేచిపోయిందని వూరంతా ప్రచారం చేసింది అత్తగారు.

బాలసన్యాసమ్మ తన "ఆత్మశక్తి"తో భర్త కోసం వెదుకుతూ బందరు చేరుకొంది. ఆమె భౌతిక శరీరం మేడలోనే వుంది. ఆత్మ మాత్రమే బందరు వచ్చింది. బందరులో తన భర్త ఎక్కడ వున్నాడో తెలియక, వూళ్ళో దీపాలన్నీ ఆరి పోవాలనీ, తన భర్త గదిలో దీపం మాత్రమే వెలగాలని ప్రార్థించింది. బందరులో దీపాలన్నీ ఆరిపోయాయి. చెంచన్న ఇంటిలో మాత్రమే వెలుగుతోంది. నిద్రలోవున్న తన భర్తను లేపి తన కష్టం అంతా చెప్పుకొంది.

చెంచన్నకు అది కలో, మాయో అర్థం కాలేదు. కలవరపడి, సెలవుపెట్టి మర్నాడే ఇంటికి బయల్దేరి వచ్చాడు. కోడలి మీద చెప్పకూడనివన్నీ చెప్పి అలాంటి దాన్ని ఏలుకోగలిగితే ఏలుకో అన్నది తల్లి! చంచన్న దిక్కుతోచక సన్యాసమ్మ దగ్గరకు వచ్చాడు. కృశించిపోయి దీనావస్థలో వున్న భార్యని చూసి కరిగిపోయాడు. భర్త పాదాలు పట్టి కక్కటిల్లి ఏడ్చింది బాలసన్యాసమ్మ. పుట్టింటికి పంపిద్దామని ప్రశ్నించాడు చంచన్న. ప్రాణాలు పోయినా పుట్టింటికి వెళ్లనంది నన్యాసమ్మ. చేసేదిలేక చంచన్న వేరు కాపురం పెట్టే నిర్ణయం తీసుకున్నాడు. తన వాటా ఆస్తి పంచి ఇమ్మని అడిగాడు. ఆస్తి పంపకాల విషయంలో అన్నదమ్ముల మధ్య తీవ్ర విభేదాలు ఏర్పడ్డాయి. పంచాయితికి ఎక్కుతానన్నాడు అన్న. తమ్ముణ్ణి అనరాని మాటలతో నిందించాడు. భరించలేకపోయాడు చెంచన్న. సున్నిత మనస్కుడు కావడంతో అవమానం భరించలేక కత్తితో పొడుచుకొని ఆత్మహత్య చేసుకొన్నాడు.

బాలసన్యాసమ్మ దుఃఖానికి అంతు లేకుండా పోయింది. తను ఎవరి కోసం బతికుండాలో ఆమెకు అర్థం కాలేదు. తన భర్తతోనే తన శరీరం కలిసి పోవాలని కోరుకొన్నది.

మరిది అప్పన్నని వెంటబెట్టుకొని తిన్నగా మచిలీపట్నం కలెక్టర్ ఆఫీనుకు చేరింది. తన ఆత్మశక్తిని ప్రదర్శించి, నహగమనం జరుపుకోవడానికి అనుమతి సంపాదించింది. మరణించిన తన భర్తచేత స్పిండియా కంపెనీ అధికారులతో మూడు మాటలు మాట్లాడింది. చిన్ననాటి నుంచి పెంచిన వదినని పిలిపించుకొని, తన అన్నకు చెబితే తట్టుకోలేడని చెప్పవద్దని కోరి, చితిని పేర్పించుకొని సహగమనానికి తలపడింది.

అన్నగారికి ఇది తెలిసి పరుగున వచ్చి తనుకూడా చితిలో పడతానని గుండెలు బాదుకుని గోడుగోడున ఏడ్చాడు.

"ఈ గుండం పతివ్రతది.. నీకు కాదు..." అని వారించింది సన్యాసమ్మ. అందరికి నమస్కరించి గుండంలోకి దూకి అగ్నికి ఆహుతి అయిపోయింది.

అన్నగారు రామన్న తన చెల్లెలికి విశాఖపట్నం జిల్లా దివిలిలో గుడికట్టించాడు. అప్పటి నుంచి బాలసన్యాసమ్మకు అక్కడ పేరంటాలు పూజలు జరుగుతున్నాయి. ఆమెకు కృష్ణా జిల్లాతోఉన్న సంబంధం, మచిలీపట్నంలో ఆమె నహగమనం చేయడాన్ని అధికారులు అనుమతించడం, ఆమె భర్త చంచన్న మచిలీపట్నంలో ఉద్యోగం చేస్తూ మరణించడం మాత్రమే! అయితే అప్పటికి 'దివిలి' మచలీపట్నం జిల్లాలో ఉండేది.

## మంగమ్మ తల్లి

కృష్ణాజిల్లాలో కొన్నిచోట్ల మంగమ్మతల్లి జాతరలు నిర్వహిస్తూ వుంటారు. బెజవాడ దగ్గర పెనమలూరులో రెండు మూడేళ్ళకోసారి గౌడ కులస్థులు మంగమ్మతల్లికి కొలుపులు జరుపుతుంటారు. ప్రతి శుభకార్యానికి గౌడలు మంగమ్మని కొలుచుకోవడం పరిపాటి.

## మద్దిరామమ్మ తల్లి

జింజేరు గ్రామం బంటుమిల్లికి 6 కి.మీ. దూరంలో వుంది. ఆ ఊళ్ళో గోగులమ్మ దేవాలయం ప్రసిద్ధి. గోగులమ్మ జాతర రోజున

మద్దిరావమ్మ, ముత్యాలమ్మ, మావిళ్ళమ్మ, మారెమ్మ, గంగానమ్మ గ్రామదేవతల్ని కూడా కలిపి, పెద్ద ఉత్సవం జరుపుతారు. ఈ ఉత్సవాన్ని గ్రామ దేవతల జాతర అంటారు.

అంటు వ్యాధులు ప్రబలినప్పుడు, గ్రామదేవతల్ని తృప్తిపరిస్తే వ్యాధులు ఉపశమిస్తాయని 'గ్రామదేవతల జాతర' జరుపుతుంటారు. ముడుపులు కట్టి, అమ్మవార్లను ఊరేగించి జంతు బలులు చేసుకొంటారు. మొక్కుబడులు చెల్లించుకొంటారు. కుమ్మరులు, కళావంతులు, గౌడలు, కాపులు ఈ జాతర్లకు నేతృత్వం వహిస్తుంటారు.

## మహాకాళమ్మ తల్లి

విజయవాడ నుంచి బందరు వెళ్ళే దారిలో ముక్కొల్లు గ్రామం వుంది. ఇక్కడ మహాకాళమ్మ గుడిలో అయిదు అడుగుల ఎత్తున అమ్మవారి విగ్రహం వుంది. ఆ దారిన పోతున్న ఒక ఎడ్ల బండిమీద ఎవరికీ కన్పించకుండా అమ్మవారు ప్రయాణించిందనీ, ముక్కొల్లు దాకా వచ్చాక బండిలోంచి దూకి ఇక్కడ స్థిరనివాసం ఏర్పరచుకొన్నదని స్థలపురాణం చెప్తోంది.

ఫాల్గుణ శుద్ధ పౌర్ణమి రోజున మహాకాళమ్మ జాతర చేస్తారు. కోళ్ళు, గొర్రెలు, మేకల్ని బలులిచ్చుకొంటారు. మొక్కుబడులు చెల్లించు కొంటారు. 1945 నుంచి ఇక్కడ ఉత్సవాలు జరిపి, తిరుణాళ్ళు జరపడం మొదలయ్యింది. జాతర సందర్భంగా పోతురాజుకి గంగానమ్మకూ "చద్ది" నైవేద్యం పెట్టుకోవడం ఆచారం.

## మారెమ్మ తల్లి

"విలేజ్ గాడ్స్ ఆఫ్ సౌత్ఇండియా" అనే గ్రంథంలో రచయిత మారెమ్మ కథని జమదగ్ని భార్య రేణుకాదేవి (ఎల్లమ్మ) కథతో ముడిపెట్టిన ఒక ఉదంతాన్ని వర్ణించారు.

ఆకాశంలో గంధర్వుడు విహరిస్తూ వెళ్తుంటే చూసి "ఆహా! ఎంత బావున్నాడో..." అనుకొన్నది రేణుకాదేవి. మనసు చలింప చేసుకున్నది కాబట్టి తన భార్య అపవిత్రురాలయ్యిందని కోపగించాడు జమదగ్ని. వెంటనే తన

కొడుకుని పిలిచి తల్లి తల తెగనరకమని ఆదేశించాడు. ఎందుకు ఏమిటీ అని అడక్కుండా వెంటనే గొడ్డలి ఎత్తాడు పరశురాముడు. ఇది చూసి మాదిగ కులానికి చెందిన ఒక స్త్రీ "అయ్యో" అనుకొంటూ వచ్చి రేణుకాదేవిని కావులించుకొన్నది. పరశురాముడి వేటుకి ఇద్దరు స్త్రీల తలలు ఒకేసారి తెగిపడ్డాయి.

పితృవాక్య పాలనని ఇంత గొప్పగా చేసినందుకు తండ్రి జమదగ్ని సంతోషించి ఏదైనా వరం కోరుకోమన్నాడు. పరశురాముడు తల్లులిద్దరినీ బతికించమన్నాడు.

ఒకపాత్రలో నీళ్ళు పోసి, ఒక బెత్తం కూడా ఇచ్చి, తల మొండెం ఒకచోట చేర్చి నీళ్ళు చల్లి బెత్తంతో స్పృశిస్తే ప్రాణాలు తిరిగి వస్తాయని చెప్పాడు జమదగ్ని. పరశురాముడు ఆ కంగారులో రేణుకాదేవి శరీరానికి మారెమ్మ తలని, మారెమ్మ శరీరానికి రేణుకాదేవి తలని అంటించి పునరుజ్జీవితులుగా చేశాడు. ఇద్దరూ దేవతలయ్యారు.

మాదిగ స్త్రీ శిరస్సు వున్న దేవత ఎల్లమ్మగానూ, బ్రాహ్మణ స్త్రీ శిరస్సు వున్న దేవత మారెమ్మగానూ ప్రసిద్ధులయ్యారు. మారెమ్మకు మేకలు కోళ్ళు, ఎల్లమ్మకు దున్నపోతులూ బలి ఇస్తారని "విలేజ్ గాడ్స్ ఆఫ్ సౌత్ ఇండియా" గ్రంథ రచయిత పేర్కొన్నాడు. మారెమ్మనే మరియమ్మగా వ్యవహరిస్తున్నారని అంటాడు. రచయిత వైట్‌హెడ్ క్రైస్తవ మతప్రచారకుడు కావడం గమనార్హం.

## మాలచ్చమ్మ తల్లి

లక్ష్మమ్మ, లచ్చమ్మ, మాలక్ష్మమ్మ ఒకే దేవతకు వివిధ నామాలు కావచ్చు. లేదా వివిధ ప్రాంతాలలో లక్ష్మమ్మ పేరుతో అనేకమంది పేరంటాళ్ళు పూజలందుకొంటూ వుండవచ్చు.

ప్రేమలతగారు తెలుగు జానపద సాహిత్యం - పురాణ గాథలు గ్రంథంలో లక్ష్మమ్మకు సంబంధించిన ఒక కథ ఇచ్చారు. ఇది ఏ ప్రాంతంలో జరిగిన కథో ఏ కాలంనాటిదో స్పష్టంగా తెలియదు.

"మునలప్పనాయుడి కుమార్తె లక్ష్మమ్మ. ఆమె వివాహము వెంకయ్యనాయుడితో జరిగెను. వీరిరువురి కుమార్తె పార్వతి. లక్ష్మమ్మ ఆడబిడ్డ. పార్వతిని తన కుమారునికిచ్చి వివాహము చేయమని కోరగా, తన అన్న కొడుకునే ఇచ్చెదనని లక్ష్మమ్మ సమాధాన మొసంగెను. అత్త, ఆడుబిడ్డలు లక్ష్మమ్మ తన కోరికను తిరస్కరించిందనే కోపముచేత లక్ష్మమ్మకు దాసీవానికి సంబంధమంటగట్టి భర్తచేత ఆమెను చంపించిరి. అంత్యక్రియలు జరిగిన పిదప చితియందు లక్ష్మమ్మ శిలయై నిలిచి పోయెను. వెంకయ్య, ఆడబిడ్డలు హతులైరి. నూటొక్క గుడులలో లక్ష్మమ్మ పూజలందుకొంటూ సంతతిలేని వారికి సంతతిని నొసంగుచున్నది" అని రాశారామె!

గంపలగూడెం దగ్గర కొత్తపల్లి అనే కుగ్రామంలో అంకమ్మ తల్లి మాలచ్చమ్మ తల్లి ఇద్దరికీ కలిపి జాతర నిర్వహిస్తుంటారు. ప్రతీ మాఘశుద్ధ పౌర్ణమికి అంటే జనవరి, ఫిబ్రవరి నెలల్లో ఈ జాతర జరుగుతుంది. తెలగ కులస్థులకు ఈ జాతరలో ప్రాధాన్యం ఉన్నది. తిరుణాల జరుగుతుంది. పెద్ద సంత కూడా జరుపుతారు.

## మావుళ్ళమ్మ తల్లి

కృష్ణాజిల్లాలో మావుళ్ళమ్మ తల్లి జాతరని ఇతర గ్రామదేవతలతో కలిపి నిర్వహిస్తుంటారు.

జింజేరు గ్రామంలో గ్రామదేవతల జాతర పేరుతో తొమ్మిది నుంచి పదకొండు రోజుల పాటు పెద్ద ఉత్సవాలు చేస్తుంటారు. నాలుగైదేళ్ళకొకసారి ఈ కొలుపులుంటూ వుంటాయి.

గోగులమ్మ, మద్దిరామమ్మ, ముత్యాలమ్మ, మారెమ్మ, గంగానమ్మలతో పాటు మావూళ్ళమ్మ విగ్రహానికి కూడా పూజలు చేస్తారు, ముడుపులు కడతారు. గొర్రెలు, మేకలు, పందులు, కోళ్ళు కనీసం వెయ్యి వరకూ బలి అవుతాయి ఆ రోజున. కనక తప్పెటలు, క్షురక మేళాలు, పంబలగోడు,

కమిలక, ధిల్లి.. లాంటి సంగీతనృత్యకార్యక్రమాలు చాలా ఉత్కంఠభరితంగా నిర్వహిస్తారు.

కుమ్మరులు, జాంబవంతులు, గౌడలు, కాపులు ప్రధానంగా ఈ గ్రామ దేవతల పండుగకు సారథ్యం వహిస్తుంటారు.

## ముత్యాలమ్మ తల్లి

ముత్యాలమ్మ ప్రాచీన గ్రామదేవతలలో ముఖ్యమైనది. వర్షాలు లేనప్పుడు కరవు పెరిగినప్పుడు, చెరువులు ఎండిపోయినప్పుడు గ్రామీణులు ముత్యాలమ్మ కొలుపు చేసుకొంటారు. కృష్ణాజిల్లాలో గంగానమ్మ, పోలేరమ్మ, ముత్యాలమ్మల ప్రసిద్ధి ఎక్కువ.

గుమ్మడిదుర్రు గ్రామం నందిగామ తాలూకాలో వుంది. ఇక్కడ ముత్యాలమ్మ మానవ రూపంలో వున్న విగ్రహానికి పూజలు జరుపుతున్నారు. శ్రావణమాసంలో ఒక ఆదివారం నాడుగాని, గురువారంగానీ జాతర చేస్తారు. నందిగామ తాలూకా, తోటరావులపాడు, పోచంపల్లి గ్రామాలలోకూడా ముత్యాలమ్మ గుడి, మానవరూప విగ్రహాలు వున్నాయి. జాతరలు జరుగుతాయి.

కొడవటికల్లు గ్రామంలో యాదవులు ప్రధానంగా ముత్యాలమ్మ కొలుపులు నిర్వహిస్తు వుంటారు. ప్రసాదాన్ని అన్ని కులాల వారికి పంచుతారు. కులాలతో నిమిత్తంలేకుండా హిందువులంతా ముత్యాలమ్మ జాతరలో పాల్గొంటూ వుంటారు.

తిరువూరు తాలూకా ఊటుకూరు, గొల్లమందల, ముచ్చినపల్లి మాధవరం, అక్కుపాలెం, కొండూరు, పాలిశెట్టిపాడు గ్రామాలలో ముత్యాలమ్మ విగ్రహానికి పూజాదికాలు జరుగుతున్నాయి. శ్రావణమాసంలో ముత్యాలమ్మ జాతర నిర్వహిస్తారు. ప్రభలు కట్టి ఊరేగిస్తారు. పశువులకు అనారోగ్యం కలగకుండా, అంటువ్యాధులు ప్రబలకుండా ముత్యాలమ్మతల్లిని తృప్తి పరుచుకొంటూ వుంటారు. బోనాలు ఇచ్చుకొంటారు మొక్కుబడులు చెల్లించుకొంటారు. మాఘ ఫాల్గుణ

మాసాలలో కూడా ఒక్కోసారి జాతరలు చేస్తుంటారు. మాధవరంలో అంకమ్మ ముత్యాలమ్మ జాతరలు కలిపి నిర్వహిస్తారు.

జానపదులు ముత్యాలమ్మ దేవతను కొలుస్తూ పాడుకొనే యీ పాట ఆ దేవత ప్రాధాన్యతను తెలుపుతుంది.

ముత్యాలమ్మ నీకు దండాలమ్మా, తల్లి ముత్యాలమ్మ నీకు దండాలమ్మా
ఏడేడు పొలిమేరలు ఎన్నెన్నో తిరిగినాము, ఏపాకు మామిడాకు ఎంతెంతో తెచ్చినాము
బండెడ్లను కట్టి ముత్యాలమ్మో నీకు, ప్రభలెన్నో కట్టేము ముత్యాలమ్మా
॥ముత్యాలమ్మా॥
కడతేర్చేతల్లి పనినీకు కడపలన్నీ పూయించి, బోసినవ్వుల తల్లి బోనాలు చేసెదాము
డప్పునవ్వులన్నీ నీకు ముత్యాలమ్మా, దమా దమా మోగుతాయి ముత్యాలమ్మా
॥ముత్యాలమ్మా॥
కోపములే తల్లి కోడిపుంజులనిస్తా, కోరిన వరమునిస్తే కొబ్బరికాయలు కొడతాం
కొప్పిడిసి సిగమూగి ముత్యాలమ్మా, నీముంగిటికే తెచ్చాము ముత్యాలమ్మా
॥అమ్మ ముత్యాలమ్మా॥
నిను నమ్మిన వారికమ్మా నిక్కముగా భయం లేదు, మా అమ్మ పోచమ్మ మాంకాళివే తల్లి
భక్తులపాలిట తల్లి దయకూడి వుండాలి, ॥అమ్మా ముత్యాలమ్మా॥
పాపాలు కరుణించు ముత్యాలమ్మా, మమ్ము కడతేర్చవే తల్లి ముత్యాలమ్మా
పెద్దపెద్ద నదులతో ముత్యాలమ్మ, మా పెద్ద చెరువు నింపరాదె ముత్యాలమ్మ
చిన్న చిన్న నదులతో ముత్యాలమ్మ, మా చిన్న చెరువు నింపరాదె ముత్యాలమ్మ
ఘనమైన మబ్బులతో ముత్యాలమ్మ, మమా గన్నెకుంట నింపరాదా ముత్యాలమ్మ

వూరూర తిరిగేటి వుప్పలమ్మవే। ॥అమ్మా ముత్యాలమ్మా॥
పంటలన్ని పాడాయె పలు బాధలు మెండాయె, నీరు నిప్పులు లేక నిద్రాహారములు లేవు.
పెద్దపెద్ద మబ్బులతోటి ముత్యాలమ్మ, మా పెద్ద చెరువు నింపవమ్మ ముత్యాలమ్మ
॥తల్లి ముత్యాలమ్మ॥
నారుసార నీరు లేదు నోరు తడప బాధాయె, పశువుల బాధలు సూడ ముత్యాలమ్మా ఓ ముత్యాలమ్మ
పరమేశుడు రాడాయె ముత్యాలమ్మ, గంగావు పాలు నీకు ఘనమైన బోనాలు
భక్తులను కాపాడు భక్తిగూడి వుంటాము, ముత్యాలమ్మ నీకు దండాలమ్మ తల్లీ ముత్యాలమ్మ నీకు దండాలమ్మా.

## మావూరమ్మ

మద్రాసు ప్రాచ్య లిఖిత పుస్తక భండాగారంలో 694వ నంబరుతో ఉన్న గ్రంథంలో మాహురమ్మ కథ ఉన్నది. కృష్ణా జిల్లాలో ఈ మాహురమ్మ ఆలయాలు ఉన్నా కూడా పశ్చిమ గోదావరి నుంచి వలస వచ్చినట్టు కనిపిస్తున్నది. గోదావరి సీమలో మావుళయ్య, , మావుళమ్మ పేర్లుగలవారు, మావుళమ్మ గుడులు అధికంగా కనిపిస్తాయి. ఈ దేవతకు ఎంత ప్రాచుర్యం ఉన్నదంటే 'గిరిరాజాయుధం' పేరుతో ఒక పద్య కావ్యం ఉన్నది. లైబ్రరీలో భద్రంగా ఉన్న ఆ కావ్యంపేరు గిరిరాజాయుధం ఇందులో కావ్య వస్తువు మావురమ్మ మహిమ. మావూరమ్మ మాహూరమ్మ కావచ్చు. మాహూరమ్మ సప్తమాతృకలలో ఒకరు.

"శ్రీరాజాధిరాజు గిరిరాజు
కలునంది కలుబెరిక గలిగినా రాజు
కలనవోయిన భవులు కలిగిన రాజు
రామకుంభిణి, రక్తకుంభిణి
కంచుకుంభిణి గజకుంభిణి

'ఏకచ్ఛత్రంబుగా భోగావతి యేలినరాజు
అటువంటి రాజుకు అతని కులాంగి
యగు పుణ్యశాలి జమిలి దేవికి పుత్ర
సంతానమేగాని ఆడ సంతానం లేదు
అంతటి సమిలికెదేవి అతివేగవచ్చి
తన ప్రాణనాధునికె దండములు పెట్టెను

తండ్రి తాతల సెలవు తీసుకొని
పర్ణశాలకు వచ్చియా పరశురాముడు
ఎప్పటివలెనే జమదగ్ని తపసికి
బోగాలు మోస్తున్నది రేణుక-

ఇలా సాగే ఈ కావ్యాన్ని "వికారి నామ సంవత్సర బోళుగుణ బవుళ విదియనాడు నాగండ్ల రామయ రచించి..."నట్టు గ్రంథం చివర ఉన్నది.

19వ శతాబ్దం మధ్యకాలంలో ఆనాటి శిష్టులు ఫాల్గుణ మాసాన్ని 'బోళుగుణ మాసం' అని వ్రాసేవారు. అలాగే బహుళ పక్షాన్ని 'బవుళ' అని వ్రాసేవారు. ఈ గ్రంథంలో పాటించిన శైలిని బట్టి ఖచ్చితంగా 19వ శతాబ్దానికి పూర్వపు రచన అనుకోవచ్చును.

## ముప్పాలమ్మ తల్లి

నందిగామ తాలూకాలో "ముప్పాల" గ్రామం వుంది. ముప్పాలమ్మ ఆ గ్రామానికి దేవత! ముప్పాలమ్మ పేరుతోనే ఈ వూరికి ఆ పేరు వచ్చిందని స్థానికులు భావిస్తారు. 13వ శతాబ్దికి చెందిన కొన్ని శాసనాలు ఆ గ్రామంలో దొరికాయి. ఆ గ్రామ చరిత్ర పైన పూర్తి పరిశోధన జరగలేదు.

మూడు మట్టి దిబ్బలున్న ప్రాంతం కాబట్టి ముప్పాల అనే పేరు వచ్చిందని మరొక కథనం వుంది.

ఇక్కడ ముప్పాలమ్మ దేవాలయంవుంది. మానవ రూపంలో ఈ దేవతను ఆరాధిస్తారు. ఫాల్గుణ శుద్ధ ఏకాదశి నుంచి పూర్ణిమ దాకా అయిదు రోజులు పాటు ముప్పాలమ్మ జాతర నిర్వహిస్తూ వుంటారు. ఈ జాతరను యాదవులు ప్రత్యేక బాధ్యతని తీసుకొని జరుపుతున్నారు.

ముప్పమ్మ - ముప్పాలమ్మ బహుశ ఒకరే కావచ్చు. ముప్పాలు తొలగించే దేవతగా ఈ అమ్మవారిని ప్రజలు ఆరాధించడం ప్రారంభించి వుండవచ్చు. ఎల్లమ్మ, మైసమ్మ, పోచమ్మ మాదిరే ముప్పమ్మ కూడా ప్రాచీన గ్రామదేవత కావచ్చు.

## పైడమ్మతల్లి

కొండవీటి రెడ్డి రాజుల తర్వాత కృష్ణాతీరాన్ని పాలించిన ఒరిస్సా కళింగ గజపతుల్లో విద్యాధర గజపతి ప్రముఖుడు. ఆయన తనకుమార్తె లిద్దరికి గ్రామదేవతలు పైడమ్మ, ముత్యాలమ్మల పేర్లు పెట్టుకున్నాడు. బెజవాడ దగ్గరి ముత్యాలంపాడు, పైడూరుపాడు గ్రామాలు ఈ ఇద్దరు కుమార్తెల పేర్లతోనే ఏర్పడ్డాయని చరిత్రకారులు భావిస్తున్నారు. ముత్యాలమ్మనీ, పైడమ్మనీ ఆయా గ్రామాలలో ఆరాధిస్తున్నారు. పైడమ్మతల్లి పైడితల్లి ఒకరే కావచ్చు.

## పైడితల్లి దండకం:

ఎవరు వ్రాశారోగాని 'పైడితల్లి దండకం' పేరుతో ఒక గ్రంథం ఉన్నది. ఆదండకం ఇలా సాగుతుంది.

"శ్రీ మన్మహా పార్వతీ లోకమాతా జగద్రక్ష దాక్షాయణీ
కాళికా బాలికా సుందరీ నీల లోలాయతాక్షీ
కృపాదీనపక్షా కుజప్రష్ఠ శిక్షా మృడానీ భవానీ
శివా శాంభవీ శాంకరీ, సర్వమాంగల్య శృంగార
కరీ ఉమా గౌరి భూతేశు రాణీ...

అన్ని దండకాల వలెనే ఆరాధనా దేవత ప్రశంస ప్రథమ భాగంలోను, నడుమ అమ్మవారి శక్తిసామర్థ్యాలను ముగింపులో ముందు కవి తన గురించి చెప్పుకోవడం ఫలశ్రుతి ఆ గ్రంథంలో ఉన్నది నమస్తే... నమస్తే నమః అంటూ ముగుస్తుంది మావుళమ్మ దండకం.
ముగింపు ఇలా వుంటుంది.

"ఫాలప్రదేశంబునన్ జక్కగా నున్న ముత్యాల చేర్చుక్క
చుక్కయనం దోచగా వేణియాశ్రోణి మధ్యంబు
గాపాద విన్యాసముల్ చూపుచేన్ వచ్చి నీ దర్శనం బిచ్చి
కారుణ్యాభావంబుతో నీదు ముంజేతి యాకంకణంబుల్
నినాదింపగా హస్తముల్ సాచి నీకేమి భీతేమి లేదంచు
నాకీ వరంబిచ్చి నా చిత్త సంతాపముందీర్పవే లోక
వారిధిన్నన్ జేర్పవే నాదునుల్లంబు రంజిల్లగా
బిల్లలం జూచి శీఘ్రంబె సౌఖ్యంబు నొందించవే
సర్వ మంత్రాత్మికే, సర్వ తంత్రాత్మికే సర్వయంత్రాత్మికే
పాహి తుభ్యం నమః పాహి తుభ్యం నమః
పాహి తుభ్యం నమస్తే నమః

## బుచ్చమ్మ- పల్లా కోటమ్మ తల్లి

గుడివాడకు సమీపంలో ముదునూరు గ్రామం వుంది. "ముదు" రాజవంశానికి చెందిన నూరుమంది రాజులు పాలించిన ఊరు కాబట్టి ముదునూరు అన్నారని చెప్పుకొంటూ వుంటారు. కాకతీయ రుద్రాంబ ఈ ఊరు మీదుగా దండుతో వెళ్ళి శ్రీకాకుళం జయించిందని, వరంగల్లు నుంచి శ్రీకాకుళం దాకా వాళ్ల దండు వచ్చిన మార్గాన్ని దండు బాట అంటారనీ ప్రతీతి. ఇక్కడ దొరికిన రామలింగేశ్వరస్వామి దేవాలయంలో ఈ విషయాలున్న శాసనం ఒకటి దొరికింది.

ముదునూరులో ఏడు చెరువులున్నాయి. పిళ్ళా కోటమ్మ చెరువు, క్రొత్త చెరువు, అక్కరాజు చెరువు, ఎర్ర గురువాయి చెరువు, నల్లగుంట చెరువు, మాదిగల చెరువు, బుచ్చమ్మ చెరువు అనే పేర్లతో ఈ ఏడు చెరువులూ ప్రసిద్ధం వీటిలో పిళ్ళా కోటమ్మ, బుచ్చమ్మలు ఆ ఊరిలో సతీసహగమనానికి తలపడి ప్రసిద్ధులైన పేరంటాళ్ళు. వారిద్దరి జ్ఞాపకార్థం రెండు చెరువులు తవ్వించుకున్నారు ప్రజలు....

రెండు వందల ఏళ్ళ క్రితం కథ ఇది. కూరాకుల వియన్న కొడుకూ

కోడలు బుచ్చమ్మ సుబ్బన్న దంపతులు యాదవ కుటుంబానికి చెందిన వాళ్ళు, ఊళ్ళో సుఖంగా జీవిస్తుండేవారు. బుచ్చమ్మ ఊయ్యూరు వీరమ్మ పేరంటాలమ్మ తల్లికి వారు పరమభక్తులు. శివపార్వతుల్ని, వీరమ్మని భక్తితో కొలిచి అరాధిస్తూ వుండేవారు. ఒకరోజు బుచ్చమ్మ భర్త సుబ్బన్న జ్వరంపడి మరణించాడు. వియోగభారం భరించలేని బుచ్చమ్మ తన ఆరాధ్యదేవత తిరుపతమ్మ పేరంటాలుని తలుచుకొని తల్లిదండ్రులు, అత్తమామలు అనుమతి తీసుకొని సహగమనం చేసుకొంది.

మంటల్లోకి దూకిన తర్వాత ఆమె తన భర్త పేరుని మూడుసార్లు స్మరించిందట. భక్తులు పిలిచినప్పుడు మంటల్లోంచి మూడుసార్లు పలికిందట.

ఆమె 'సాగుమానం' జరిపినచోట ఒక దేవాలయాన్ని నిర్మించారు. ఆమె విగ్రహాన్ని చేయించి, ఆమె కుమారుడు "కూరాకుల వియ్యన్న" ఇంట వుంచారు. ఈ వియ్యన్న 90 సంవత్సరాలు బ్రతికాడు.

ముదునూరులోనే జరిగిన మరో సాగుమానం పిళ్ళా కోటమ్మ పేరంటాలు. ఈ ఇద్దరిలో ఎవరి సంఘటన ముందు జరిగిందో తెలియదు. ముదునూరులో బుచ్చమ్మ తల్లి దేవాలయం, పిళ్ళా కోటమ్మ దేవాలయం రెండూ వున్నాయి. ఫాల్గుణ శుద్ధ ఏకాదశి నుంచి బహుళ ఏకాదశి వరకూ ఫిబ్రవరి, మార్చి నెలల్లో 16 రోజుల పాటు బుచ్చమ్మ తల్లి తిర్ణాల జరుపుతారు. మొదటి రోజు ఉదయం పల్లకిలో బుచ్చమ్మ విగ్రహాన్ని తీసుకుని ఊరేగింపుగా పిళ్ళా కోటమ్మ గుడికి, గంగానమ్మ గుడికి తీసుకు వెళ్ళి మూడు విగ్రహాలకూ ఒకేసారి పూజలు జరుపుతారు.

గణాచారులు, గోళ్ళ పేరంటాళ్ళు, అఖండ గండదీపాలతో మేళతాళాలతో బుచ్చమ్మ విగ్రహాన్ని ఊరేగింపుగా తీసుకెళ్ళి ఆమె క్షేత్రం దగ్గర ఊయలలూపి, ప్రదక్షిణలు చేయిస్తారు.

ఆ విగ్రహానికి సాగిలబడి మొక్కితే గొడ్రాళ్ళు తల్లులవుతారని ప్రతీతి. పదహారవ రోజున పసుపు నీళ్ళు "వారపోస్తారు". ఏలూరు వరకు తెచ్చి నదిలో విగ్రహానికి స్నానాదులు చేయించి నూతన వస్త్రాల్ని నదిలో తడిపి

ఆ బట్టలతో విగ్రహాన్ని శుభ్రం చేస్తారు. తర్వాత మూడు మారులు ఆమెను దేవాలయంలో పునః ప్రతిష్టిస్తారు.

## ఎల్లమ్మ తల్లి

ప్రాచీన గ్రామదేవతలలో యల్లమ్మ ప్రసిద్ధ స్త్రీ దేవత. ఈ తల్లిని 'మాత' అనీ, మహుంరమ్మ అనీ, అక్కలదేవి అనీ, రేణుకాదేవి అని కూడా పిలుస్తారు. ఎల్లమ్మ పేరు గ్రామదేవతగా ప్రసిద్ధి. "ఏకవీరామహాదేవి" అనేపేరు క్రీడాభిరామంలో కన్పిస్తుంది. పరశురాముడి తల్లి రేణుకాదేవినే ఇన్ని పేర్లతో వ్యవహరిస్తూ ఆరాధిస్తున్నారు. "ఓరుగంటి ఎల్లమ్మ"గా "కాకతి" అనే కుల దేవతతో సమానమైన కీర్తిని ఎల్లమ్మ దేవత కూడా పొందింది. గుడి- గుంఫ గ్రంథంలో కీర్తిశేషులు వర్మగారు ఎల్లమ్మే ఎల్లారమ్మ కావచ్చునని వ్రాశారు.

ఆలంపురం బ్రాహ్మణేశ్వరాలయంలో తలా చేయీ లేని ఒక స్త్రీ దేవతా విగ్రహాన్ని ఎల్లమ్మగా భావించి పూజిస్తున్నారని, పరశురాముడు తండ్రి ఆజ్ఞ మేరకు తల్లి రేణుకాదేవి తలను ఖండిస్తే అది ఎలాగో వెళ్ళి పడిందనీ, విగ్రహం మాత్రం ఇక్కడ నిలచిందనీ, ఈ దేవతకు మొక్కుకొంటే, సంతానం కల్గుతుందనీ 'ఆలంపూర మహత్యం'లో వున్నట్లు రావి ప్రేమలత, తెలుగు జానపద సాహిత్యం - పురాణగాధలు గ్రంథంలో పేర్కొన్నారు.

జనంలో వ్యాప్తిలో వున్న ఈ కథనే పురాణాలలో తీసుకొని రామాయణ భారతాలలో చేర్చారని కొందరు పండితులు భావిస్తారు. యల్లమ్మ దేవత పల్లె ప్రజల్ని రక్షించే దేవత. సంతతిని కల్గిస్తుంది. కడుపునొప్పి, విరేచనాలు, జ్వరాలు వచ్చినప్పుడు ఎల్లమ్మతల్లికి మొక్కుకొంటారు.

చాలామంది ఇళ్ళలో 'ఎల్లమ్మ గూడు' వుంటుంది. లేదా గోడకు పసుపు రాసి, కుంకుమతో బొట్లు పెట్టి గీతలు గీసి ఎల్లమ్మగా పూజిస్తుంటారు.

మానసాదేవి, ఎల్లమ్మలు శివుడి కుమార్తెలని, ఉత్తరభారత దేశంలో

మానసాదేవి, దక్షిణ భారతదేశంలో ఎల్లమ్మలు పూజలందుకుంటున్నారని అంటారు. మానసాదేవి ఆలయాలు రుషికేశం, హరిద్వారంలోనూ ఉన్నాయి.

పాముకాటు నుంచి రక్షించే దేవతకూడా ఈ ఎల్లమ్మ తల్లే! ఆమె గురించి ఎన్నో రకాల కథలు ఉన్నాయి. అనసూయ వంటి పతివ్రతల కథల్లో కన్పించే సంఘటనలు ఎల్లమ్మతల్లి కథల్లోనూ కన్పిస్తాయి.

పాముల వలన ప్రమాదమేర్పడినప్పుడు ఎల్లమ్మ దేవతనే ప్రార్థిస్తారు. ఈ ఎల్లమ్మ దేవతకు పాము జాతులపై సర్వాధికారములు కలవని, అవి యీ దేవత ఆజ్ఞలను శిరసావహిస్తాయని ఆమె యిష్టానుసారం భక్తులకు, కీడులు, మేలులు జరుగుతాయని వారి నమ్మకం. ఈ గేయాన్ని పరిశీలిస్తే ఎల్లమ్మ దేవతపై గ్రామీణులకు గల భక్తి విశ్వాసాలు అర్థం అవుతాయి.

"పుట్టల్లరాణి ఎల్లమ్మ పుట్టల్లరాణి ఎల్లమ్మ పుట్టల్లరాణి ఎల్లమ్మ
నీ పుట్ట సుట్టన్ని ఎల్లమ్మ పూల వరాలె ఎల్లమ్మ, చంద్రా వరాలె ఎల్లమ్మ
మెట్టుమెట్టుల్లరాణి ఎల్లమ్మ మెట్టుల్లరాణి ఎల్లమ్మ మెట్టుల్లరాణి ఎల్లమ్మ
నీమెట్టు సుట్టన్ని ఎల్లమ్మ మేకపోతుల్లే ఎల్లమ్మ వేపరిల్లల్లే ఎల్లమ్మ
గద్దెగద్దెల్లరాణి ఎల్లమ్మ గద్దెల్ల రాణి ఎల్లమ్మ గద్దెలరాణి ఎల్లమ్మ
నీ గద్దెసుట్టన్ని ఎల్లమ్మ గావుపిల్లల్లే ఎల్లమ్మ గవ్వదగిసెనాలె ఎల్లమ్మ
నీపున్నజడాలు ఎల్లమ్మ వీరగాలాలే ఎల్లమ్మ వీరగాలాలే ఎల్లమ్మ

| | | | |
|---|---|---|---|
| ఏపాకురిల్లల్తో | ఎల్లమ్మ | ఎండిజమిడికె | ఎల్లమ్మ |
| బూదకాంతుడెదురు | " | భోలోకాన్నెదురు | ఎల్లమ్మ |
| మాదకాంతుడెదురు | " | మాలోకానెదురు | ఎల్లమ్మ |
| శుక్రారం ఒక పొద్దు | " | సూదరంటిలోలె | " |
| మంగళారం ఒక పొద్దు | " | మాదిగింటిజోగె | " |
| పందుం బండారి | " | పక్కవోణిగట్టి | " |
| ఏదుంబండాలి | " | ఎనుకవోణి గట్టి | " |
| ముత్తుంబండారి | " | ముందలోణి గట్టి | " |

| | | | |
|---|---|---|---|
| ఏదుంబట్టేటి | " | ఏకాన్లజొచ్చేటి | " |
| పందుంబట్టేటి | " | బండారిసిప్ప | " |
| గప్పునసట్టేటి | " | వూదుపొగల్లె | " |
| జెఱపోతులబట్టి | " | జడకొప్పువేసి | " |
| తుట్టెపురుగుల బట్టి | " | తుస్సెలంట ఏసి | " |
| తాసుపాములబట్టి | " | తలకట్లు బట్టి | " |
| నిలువున పోసేటి | " | నిమ్మకాయల్లే | " |
| పసుపున్న వలమేటి | " | పాలకాయల్లే | " |
| కుక్కూన కూసేటి | " | కోడిపుంజుల్లే | " |
| మేమని అరిసేటి | " | మేకపోతుల్లే | " |
| ఢంఢం మోగేటి | " | డప్పుకొమ్ముల్లే | " |

'ఎల్లారమ్మ' అంటే ఎల్లరికి అమ్మ అని అర్థం. కవిసార్వభౌముడు మహాకవి శ్రీనాథుడు రచించినదిగా భావించబడుతున్న క్రీడాభిరామం అనే గ్రంథంలో పెనుమాక గ్రామం పేరు వినిపిస్తుంది.పెనుమాక విజయవాడను ఆనుకొని ఉన్న గ్రామం. క్రీడాభిరామం గ్రంథంలో మంచన శర్మ, టిట్టిభసెట్టి అనే రెండు పాత్రలు ఉన్నాయి. వీరిద్దరు ఓరుగల్లు కోట చూడడానికి పోతారు. అక్కడ ఏకవీర అనే గ్రామ దేవతను చూస్తారు. ఆ సన్నివేశంలో శ్రీనాథమహాకవి ఈ పద్యం చెబుతాడు.

పద్మలోచన భృగుబ్రహ్మ సంయమి వంశ
పరిబాటికభినవా భరణమయ్యె
రమణి త్రేతాద్వాపరముల సంధ్యావేళ
మగనితోఁబెక్కేండ్లు మనువుమనియె
నెలత కానకకన్న నెయ్యంపుఁగొడుకుచేఁ
జంపించె ముయ్యేడుసారెనరులఁ
దరుణి హైహయరాజదంతాస్థిపటలంబు
గవడ పేరుగఁచేసి కట్టినరుత

మండపాకను బెనుఁబాక మహూరమున
నాగవరమునఁబోలాసననిచెనింతి
యోరుగంట పయనించె నీలోత్పలాక్షి
కాకతమ్మకు సైదోడు ఏకవీర
ఇప్పుడు ఈ పద్యం భావం చూద్దాం:

'బ్రహ్మయొక్క వంశపారంపర్యములో విఖ్యాతి పొందిన భృగు వంశానికి నూతన ఆభరణముగా నిలచినది, భర్త అయిన జమదగ్ని మహర్షితో త్రేతాయుగం, ద్వాపరయుగం మధ్య కాలంలో జీవితాన్ని పండించుకొన్నది. తన ప్రియతమ కుమారుడైన పరశురామునితో ఇరవై యేడు సార్లు మదోన్మత్తులై క్షత్రియులను వధింపచేసినది. తన భర్త మరణానికి కారకులైన హైహయ రాజుల దంతాలు, ఎముకలను హారంగా చేసుకొని మెడయందు మాలగా ధరించినది. ఇటువంటి మూర్తి ఎవరంటే రేణుకాదేవి. ఈ అమ్మవారే మండపాకలో పెనుమాకలో, మాహురపురంలో, నాగవరంలో, పోలాసలో నెలకొని ఉన్నది. ఏకవీరగా ప్రసిద్ధి పొందిన ఈ దేవి కాకతమ్మకు సైదోడుగా ఓరుగల్లులో నిలిచింది.'

కాకతీయ ప్రభువులు కొలిచే 'కాకతమ్మ'కు సైదోడు ఏకవీరాదేవి. ఈ దేవత నెలకొన్న గ్రామాల్లో పెనుమాక కూడా ఉన్నది. కాబట్టి ఏకవీరాదేవిని పెనుమాక గ్రామ ప్రజలు కొలుస్తూ ఉండేవారని అనుకోవాలి.

అయితే స్థానికుల కథనం ప్రకారం ఒకనాటి రాత్రి ఇక్కడ గ్రామస్థులకు గజ్జెల చప్పుడు వినిపించిందనీ, మరుసటి ఉదయం గుడిలో అమ్మవారి విగ్రహం కనిపించలేదనీ, ఎల్లారమ్మ (ఏకవీర) గ్రామం నుంచి కదలిపోయిందనీ గ్రామంలోని వృద్ధులు చెబుతున్నారు. అలా వెళ్ళడానికి కారణం తెలియరావడం లేదు. ఇలా వెళ్ళిన ఎల్లారమ్మ కాశీకి వెళ్ళే దారిలో ఎక్కడో ఉన్నదని కొందరు, కాదు వరంగల్లులోనే ఉన్నదని కొందరు చెబుతున్నారు. ఏది ఏమైనా ప్రాచీన కాలం నుంచి పెనుమాక గ్రామంలో ఏకవీర దేవత ఎల్లారమ్మ పేరుతో పూజలందుకొంటున్నట్టు తెలుస్తున్నది,

## ఎల్లారమ్మ ఎవరు?

ఇంతకు ముందు చెప్పుకొన్నట్టు పార్వతీదేవి స్వరూప ప్రతీకలే గ్రామ దేవతలు. సంఘ క్షేమం కుటుంబ క్షేమంతో ముడిపడి ఉంటుందని భావించిన రోజుల్లో తన కుటుంబం క్షేమం కోసం అపారమైన త్యాగాలు చేసి, సమాజానికి ఆదర్శప్రాయంగా నిలచిన పుణ్య స్త్రీలు దేవతలయ్యారు. వివాహంకాని బాలికలు కూడా గ్రామదేవతలు కావచ్చు. పేరంటాలు అవుతారు. ఆరాధనీయులవుతారు. నేటి పిదప కాలపు పద్ధతులు లేని రోజుల్లో పూర్వం ఒక ఇల్లాలు చేసిన త్యాగాలను మొత్తం సమాజం గుర్తించి ఆమెకు దేవతా ప్రతిపత్తి ఇచ్చేది. అలా వచ్చిన అమ్మవారే ఎల్లారమ్మ. ఈ సందర్భంగా ఒక కథ.

పూర్వం ఆంధ్రదేశంలో జైన మతం ప్రబలంగా ఉన్న రోజుల్లో, నేటి పశ్చిమ గోదావరి జిల్లా మార్టూరు సమీపంలోని ఒక గ్రామంలో మహాబాహు అనే ఆసామి ఉండేవాడు. మంచి అందగాడు, రసికుడు, సంపన్నుడు. తాంత్రిక ఉపాసనలతోను, ఔషధ సేవనంతోను తన మగతనాన్ని పెంచుకొన్నాడు. ఇక అతనికి పట్టపగ్గాలు లేకుండా పోయినాయి. చివరకు భార్య ఎల్లమ్మ ప్రసవించిన రోజున కూడా ఆమెను సంగమించాలన్న కోరిక ఆపుకోలేకపోయాడు. ఆమె తగదని వారించింది. అతడు విసిగి వేసారి నిష్క్రమించాడు. కాని ఆ సౌభాగ్యవతి అతడిలోని అతి కాముకత్వం వల్ల రానున్న ప్రమాదాలను గుర్తించి కులదైవమైన ఎల్లమ్మను ప్రార్థించింది.

ఆ ఇల్లాలి మొర విని ఎల్లమ్మాదేవి 'భర్తను భర్తగానే గాక బిడ్డగా చూడు, అతడికి తల్లిప్రేమ ఎలాంటిదో చూపించు అని అంతర్ధానమౌతుంది. అంతే, ఆ రోజు విచిత్రంగా ఇంటిలో చుక్క మంచినీళ్ళు లేకుండా పోతాయి. ఎవరి ఇంటిలోను మంచినీళ్ళు లేవు. ఊరులోని బావుల్లో ఎక్కడా నీళ్ళు లేవు. అదే సమయంలో భర్త మహాబాహుకి దాహం వేస్తుంది. అదేమి చిత్రమో గొంతు తడవకపోతే ప్రాణం పోతుందేమో అన్నంత దాహం. విలవిలలాడిపోతాడు. దాహం తీర్చమని భార్యను ప్రాథేయపడతాడు. ఆమె

నిస్సహాయురాలవుతుంది. ఇక చేసేదిలేక ఆ మహాతల్లి కన్నబిడ్డకు ఇవ్వవలసిన స్తన్యాన్ని భర్తకు ఇస్తుంది. దాహార్తితో మొత్తం స్తన్యం అంతా తాగేస్తాడు. కుత్తుకల నిండా తాగాడు. చివరకు రక్తం కూడా తాగుతాడు. ఆ మహాతల్లి ప్రాణాలు వదిలేస్తుంది.

అవసానంలో ఆమె కన్నవాళ్ళందరిని చేరదీసి 'నన్ను మరచిపోకండి. నన్ను తలిస్తే, కొలిస్తే మీ పసుపు కుంకుమలు చల్లగా ఉంటాయి. మీ కాపురాలు కుదుటపడతాయి. మరచిపోతే మీ భర్తలు పరనారీ వ్యసనాలకు లోనవుతారు. ఇల్లాళ్ళు పైకి బాగానే ఉంటారు. మీ భర్తల మగతనం, ఇంటి సౌభాగ్యం పరస్త్రీల పాలవుతాయి. నన్ను మరవకండి' అని చెప్పి ప్రాణాలు వదులుతుంది.

బహుశా అప్పటి నుంచి జైన తాంత్రిక సాంప్రదాయంలో భార్య స్తన్యాన్ని పూజించే వామాచార పద్ధతి వచ్చిందేమో! ఎల్లమ్మ ఎల్లారమ్మ అయి వుండవచ్చు. కథ కూడా అదే సూచిస్తుంది. దీనిని బట్టి తేలేదేమంటే ఇంటిగుట్టు కలకాలం నిలవదనీ, భార్య తన భర్తను అవసరం వచ్చినప్పుడు తల్లిగా సాకలేనప్పుడు మగవాడు చెప్పినమాట వినడనే గృహనీతిని పాటించాలని తెలుస్తుంది. సంసార సౌభాగ్యానికి, భర్తలను అదుపులో పెట్టుకోవడానికి సంబంధించిన దేవత ఎల్లారమ్మ.

ఎల్లారమ్మకు కొందరు ఆరు చేతులని భావిస్తారు. కొందరు నాలుగు చేతులున్నట్టు భావిస్తారు. ఒక చేతిలో అన్న పాత్ర, మరో చేతిలో ఖడ్గం, మరోచేతిలో పువ్వులు, మరో చేతిలో బాణం ఉంటాయని అంటారు. ఆమెకు వాహనం ఎలుక అని కొందరు, కాదు నక్క అని కొందరు అంటారు. మండపాక ఎల్లారమ్మ వాహనం నక్క. జైనులకు సరిగా ఇలాంటి తాంత్రిక దేవత ఉన్నది. ఆ దేవత పేరు చంచల. ఆమె వాహనం నక్క. ఇలాగే నాలుగు చేతులు ఉంటాయి. అయితే భార్యాభర్తల మధ్య కలహాలు పెట్టడానికి, సంసారాల విచ్ఛిత్తికి ఉపాసిక దేవత. ఏమైనప్పటికీ ఎల్లారమ్మ ఎల్లరకు కావలసిన దేవత. ఏ స్త్రీ అయినా కోరుకునేది తన సంసారం మూడు పువ్వులు ఆరు కాయలుగా సాగాలనే కదా.

# రంగమ్మ తల్లి పేరంటాలు

బహుశ 1850కి పూర్వంనాటి కథ అయివుంటుంది. తేలప్రోలు గ్రామంలో చెంచయ్య అనే కాపు కులస్తుని యింట రంగమ్మ పుట్టింది. తేలప్రోలు గన్నవరానికి 1 కి.మీ దూరంలో వుంది. ఎనిమిదో ఏటనే అటలమ్మపోసి, రంగమ్మ చనిపోయింది. రంగమ్మ చనిపోయినప్పటినుంచి ఆ వూళ్ళో అనర్థాలు ప్రారంభం అయ్యాయి. ఒకసారి అగ్నిప్రమాదం జరిగి ఊరంతా అగ్నికి అహుతి అయ్యింది. ఒక రెండు సంవత్సరాలు ఊరు అల్లకల్లోలం అయ్యింది. ఊరు జనం భయపడిపోయారు. ఒక్కొక్కరూ వూరొదిలి వెళ్ళి పోవడం మొదలుపెట్టారు. ఇలా కాదని ఇప్పటి రైల్వేలైనుకు అవతలివైపున కొత్తగా ఒక గ్రామం కట్టుకొని ఊరు మొత్తం అక్కడకు తరలిపోయింది. అయినా మళ్ళీ అదే కథ. అవే అనర్థాలు. నీళ్ళలో పసుపు ఉండలు కన్పించేవి. ఊయ్యాలల్లో చంటి పిల్లల బట్టలు వాటికవే తగలబడిపోయేవి. ఇవన్ని ఏమిటో ఎవరికీ అర్థం కాలేదు.

ఒకరోజు ఒక గాజుల బత్తుడు పొరుగూరు నుంచి వచ్చి మాలకుంట చెరువు దగ్గర ఎనిమిదేళ్ళ పిల్ల తన దగ్గర గాజులు వేయించుకొన్నదని, తాను తేలప్రోలు జక్కా చెంచయ్య కూతుర్ని అని చెప్పిందనీ, ఇంటికెడితే అర్ధరూపాయి ఇస్తారని, లోపల గదిలో గూడులో అర్ధరూపాయి వుంది అని చెప్పిందని,. అతను అంగీకరించి వెనక్కి తిరిగి చూడగానే ఆ పిల్ల మాయమయ్యిందని, దాంతో తనకు భయంవేసి ఊరులోకి వచ్చానని జరిగిందంతా చెప్పాడు. గూట్లో వెదికితే అర్ధరూపాయి, పసుపువుండలు కన్పించాయి.

ఊరి పెద్దలు బెజవాడ నుంచి "భూతముల మంత్రగాడిని" పిలిపించారు. అతను అంజనం వేసిచూస్తే ఎనిమిదేళ్ళ పిల్ల ఇంటింటికీ ఎగురుతూ తిరుగుతున్న దృశ్యం కన్పించింది. గుంటూరుజిల్లా చిలువూరు నుంచి వచ్చిన మాల అంక గణాచారికి పూనకం వచ్చి తాను దేవతనయ్యానని, తనకి గుడికట్టి పూజలు చెయ్యాలని ఆదేశించింది.

అప్పుడు గ్రామస్థులు కలిసి, కొండపల్లిలో రంగమ్మ ప్రతిమ

చేయించి తెచ్చి తేలప్రోలులో ప్రతిష్టించారు. సంతానం లేనివారికి సంతానం కల్గించే దేవతగా రంగమ్మ తల్లిని కొలుస్తారు.

రంగమ్మ తల్లి పేరంటాలు జాతర చైత్ర శుద్ధ ఏకాదశి రోజున జరుగుతోంది. పౌర్ణమి దాకా అయిదు రోజులపాటు నిర్వహిస్తారు. అమ్మవారిని ఊరేగింపుగా తీసుకొచ్చి, చలిమిడి, వడపప్పు, కొబ్బరికాయలు, అరటిపళ్ళు, అగరుధూపాలు, పసుపు కుంకుమలతో అర్చిస్తారు. నిత్యారాధన జరుగుతుంది. ప్రభలు కడతారు. పసుపు బళ్ళలో ఊరేగింపు జరుపుతారు. చీరలు, గాజులు రవికెల గుడ్డలు సమర్పించుకొంటారు. గారెలు, బూరెలు నైవేద్యంగా సమర్పించుకొంటారు.

వ్యాధులు సోకిన పశువుల్ని ఈ గుడికి తెచ్చి గుడి చుట్టూ తిప్పి వైద్యం చేయిస్తారు. గండదీపాలు వెలిగిస్తారు. ఊయ్యాలవేసి పవళింపు సేవలు జరిపిస్తారు, జాగారాలు చేస్తారు, ఉపవాసాలు వుంటారు. జక్కావారి కుటుంబీకులే పూజారులుగా వున్నారు.

## ఉయ్యూరు వీరమ్మ తల్లి

కృష్ణా జిల్లాలో వీరమ్మ తల్లి ప్రసిద్ధి చెందిన గ్రామదేవత. ఉయ్యూరు వీరమ్మ పేరంటాలు, పెనుగంచిప్రోలు తిరుపతమ్మ పేరంటాలు జాతరలకు జిల్లా నుంచే కాకుండా ఇతర ప్రాంతాల నుంచి కూడా అధిక సంఖ్యలో భక్తులు తరలి వస్తుంటారు.

వీరమ్మ కథ సరిగ్గా ఎప్పుడు జరిగిందో తెలియదు. రెడ్డిరాజుల కాలం నుంచి వీరమ్మ జాతర జరుగుతోందని భక్తుల నమ్మకం.

యాదవ కులానికి చెందిన సాంబయ్య, పార్వతి దంపతులకు వీరమ్మ తల్లి పుట్టింది. పారుపూడి వీరయ్య కిచ్చి ఆమెను పెళ్ళిచేశారు. వ్యవసాయం, పశుపోషణ వీరి కులవృత్తి.

అప్పట్లో ఉయ్యూరు గ్రామకరణంగా వున్న యాగరాజు సుబ్బన్న వీరమ్మ పైన వ్యామోహపడి ఆమె శీలం చెరిచేందుకు ప్రయత్నించాడు. అతన్ని ప్రతిఘటించిన వీరమ్మ తల్లిదండ్రులకు, అత్తమామలకు, భర్తకి ఆ

సంగతి చెప్పేసింది. పెద్ద గొడవలైనాయి. కరణం దుర్మార్గుడు ఎంతకయినా తెగిస్తాడు అని, ఆమె తల్లిదండ్రులు కరణం కోరిక తీర్చవలసిందిగా వీరమ్మని వత్తిడిచేశారు. కానీ, భర్త వీరయ్య ఆమెకు అండగా నిలబడి భార్యను దక్కించుకున్నాడు. చివరకు కరణం పారుపూడి వీరయ్యని చంపేశాడు. వీరమ్మ వైధవ్య భారాన్ని సహించలేకపోయింది. అందరి అనుమతితో సహగమనానికి తలపడింది. దేవతై వెలసింది. వీరమ్మని హింసించిన కరణం సర్వనాశనం అయ్యాడు. ఆయనను ప్రోత్సహించిన వీరమ్మ తల్లిదండ్రులు కూడా నాశనం అయ్యారు. ఈ హింసలో పాలుపంచుకున్న వీరమ్మ తోటికోడలు రాయిగా మారిపోయింది.

సహగమనం చేయడానికి వీల్లేదని కొందరు అడ్డుపడినప్పుడు ఆ ఊరు ముందుగా వెడ్తున్న నవాబుకు వీరమ్మ తన మహిమలు కనబరిచింది. దాంతో నవాబు ఆమె సాగుమానం చెయ్యడానికి అనుమతి ప్రసాదించాడు.

వీరమ్మ పుట్టిన ఇంటిలోనే వీరమ్మ విగ్రహాన్ని నెలకొల్పారు. ఆమె అత్తవారి ఇంటిని కూడా దేవాలయంగా మార్పుచేశారు. వీరమ్మ, వీరయ్యల విగ్రహాలని ప్రతిష్టించి ఆరాధనలు చెయ్యడం మొదలు పెట్టారు.

నూజివీడు దగ్గర చినఎరుకపాడు అనే కుగ్రామంలో ఒక బీద యాదవ కుటుంబంలో పుట్టి పది సంవత్సరాలు పెరిగి మరణించిన ఒక పిల్ల తాను ఊయ్యూరు వీరమ్మ తల్లి అవతారమన్నది. తన గుర్తుగా వీరమ్మతల్లి గుడి కట్టించవలసిందిగా కోరింది. ఆమె తండ్రి ఆమె కోరిక మేరకు తమ కొద్దిపాటి భూమిని అమ్మి అక్కడ ఒక గుడి కట్టించాడు.

వీరమ్మ పేరంటాలు తిరుణాల మాఘశుద్ధ ఏకాదశి అంటే జనవరి, ఫిబ్రవరి నెలల్లో జరుగుతుంది. తిరుణాల రోజున అత్తవారింటి నుంచి వీరమ్మ, వీరయ్యల విగ్రహాలు తీసుకొని పుట్టింటికి తెస్తారు. మధ్యలో కరణం సుబ్బన్న ఇంటి దగ్గర విగ్రహాన్ని ఊయల ఊగిస్తారు. కరణం ఇంటి శిధిలాల మీద రెండు స్తంభాలు పాతి ఊయ్యాల ఊగుతానని వీరమ్మ, శపథం చేసింది. ఆమె మాట ప్రకారం ఊయల ఊగించి పుట్టింటి దగ్గరకి తెస్తారు. ఆమె సాగుమానం జరిపిన చోట గుడికట్టారు. అక్కడ 'గద్దె' పైన

విగ్రహాన్ని ప్రతిష్టిస్తారు. గండదీపాలు వెలిగిస్తారు. గోధుమలున్న కుండమీద నెయ్యి పోసిన పెద్ద ప్రమిదలుంచి, వత్తి వెలిగించి, నెత్తిన పెట్టుకొని మోసుకెడతారు. గాలికి దీపాలు ఆరకుండా గొడుగులు పట్టి జ్యోతిని తీసుకువెడతారు.

కొబ్బరికాయలు, పళ్ళు, పూలు, అగరు ధూపాలు, పసుపు, కుంకుమ సమర్పించుకుంటారు. అమ్మవారికి అక్కడ నిత్యదీపారాధన, పూజలు జరుగుతాయి. సంతతిలేనివారు మొక్కుకొంటే అమ్మవారు సంతానాన్ని ప్రసాదిస్తుందని భక్తుల నమ్మిక. ఆమె స్వయంగా కొలుపు చేసుకొన్న భక్తురాలికి స్వప్నంలో కన్పించి పళ్ళు గాని, గాజులు గాని ఇస్తుందని విశ్వాసం. అదీ ఇక్కడి పద్ధతి.

పౌర్ణమి వెళ్ళిన ఏడవ రోజుగానీ, తొమ్మిదవ రోజుగానీ, "చుడిబండి నిర్వహిస్తారు. ఒక హరిజనుడు ఈ విధిని నిర్వహిస్తాడు.

## సరోజనమ్మ పేరంటాలు

సరోజనమ్మ కథ ఎక్కడ జరిగిందో తెలియదుగానీ, తెలంగాణాలో ఎక్కువ ప్రచారంలో వుంది. కృష్ణాజిల్లాలో కొన్ని చోట్ల సరోజనమ్మకు జాతరలు చేస్తుంటారు.

పుట్టింటివారు అన్నయ్య వదినెలూ పెట్టిన కష్టాలకు బలవన్మరణం పొందిన సరోజనమ్మ దేవతై వెలిసింది.

సరోజిని ఈ భౌతిక ప్రపంచంలో దురదృష్టవంతురాలిగానే పుట్టింది. పుట్టగానే తల్లితండ్రుల్ని కోల్పోయింది. ఇంకా ఈడేరక ముందే వదినల వలన కష్టాలు మొదలయ్యాయి. అన్నలు పట్నంలో కొలుపు కోసం వెళ్ళిపోవడంతో సరోజనమ్మకు దిక్కులేని స్థితి ఏర్పడింది. అరవై బిందెల నీళ్ళు తోడి చిల్లులున్న 'గోలెం' నింపమనడం వంటి ఆరళ్ళు పెట్టి వదినలు హింసించసాగారు. కన్నీరు మున్నీరై కక్కటిల్లేది సరోజనమ్మ. ఆదిదంపతులు ఆమె కన్నీరు చూసి కరిగి పోయి ఆశీర్వదించారు. ఆ ఆశీర్వాద ఫలితంగా వదినలు పెట్టే కష్టాలకు తట్టుకొనే శక్తి వచ్చింది

సరోజనమ్మకి. ఎంత కఠినమైన కష్టాలనైనా అవలీలగా భరించగల శక్తి వచ్చింది.

ఆశ్చర్యపోయారు వదినలు. ఇలా కాదని, అన్నం పెట్టకుండా మాడ్చి, మంచినీళ్ళు లేకుండా చేసి అడవికి తోలుకుపోయి పశువుల్ని మేపి తీసుకురమ్మని పంపించారు. దారిలో సరోజనమ్మకి ఎండ వేడికి బాగా దాహం అయ్యింది. దప్పికని తమాయించుకోలేకపోయింది. ఎక్కడా నీరు దొరకక, చేసేదిలేక ఆవు పంచితం తాగి ప్రాణాలు నిలుపుకొంది.

గంగగోవు పంచితం తాగిన ఫలితంగా ఆమెకు గర్భం వచ్చింది. ఇంకా ఈడేరని కన్నె పిల్లకు గర్భం వచ్చిందని తెలిసి ఆశ్చర్యపోయారంతా! వూరంతా గుప్పుమంది. పిల్లను కడుపులో పెట్టుకొని దాచుకోవాల్సిన వదినలు వూరంతా అల్లరి చేశారు. అన్నలు తిరిగి వచ్చి కోపోద్రిక్తులయ్యారు. బల్లెం తీసుకొని సరోజనమ్మని పొడిచి చంపేశారు. ఆమె గర్భం నుండి ఏడు నెలల ఆవుదూడ పుట్టింది. ఈ వింత ఏమిటో ఎవరికి అర్థం కాలేదు.

సరోజనమ్మ మరణిస్తూ, ఏడుగురు వదినలు గొడ్రాళ్ళు కావాలని, అన్నలు ఏడుగురునీ నల్లరాళ్ళు అవుతారని శపించింది. సరోజని తాను దేవతై వెలిసింది. (తెలుగు జానపద సాహిత్యము - పురాణగాథలు, డా॥ రావి ప్రేమలత. 1983.)

## శీతలాదేవి

గ్రామాలలో విరేచనాలు, వాంతులు లాంటి వ్యాధులు ప్రబలి చిన్న పిల్లలు అధికసంఖ్యలో చనిపోతున్నపుడు, పూర్వం శీతలాదేవి కొలుపులు కొలిచేవారు. మరుగుదొడ్లను శుభ్రం చేయడం వృత్తిగా చేపట్టిన పారిశుద్ధ్య కులానికి అధిష్టాన దేవత శీతలాదేవి. ఉత్తరాదిలో గ్రామదేవతగా, దక్షిణాదిలో కుల దేవతగా కొలుపులందు కొంటున్న శీతలాదేవి నిజానికి వైదికదేవత.

శ్రీ సూక్త విధిగా వేద మంత్రాలతో పూజలందుకొనే శీతలాదేవి పసిపిల్లలకు బాలారిష్టాలు కలుగకుండా కాపాడుతుందని వైదిక కుటుంబాలు విశ్వసిస్తాయి. అలాంటి వైదికాచార పరాయణుల దేవత

అట్టడుగున వున్న పారిశుద్ధ్య కులానికి ఎలా ఎప్పుడు కులదేవతగా మారిందో తెలియదు. దీనిని బట్టి కులాల చలనంతోపాటు దేవతల చలనం కూడా ఉంటుందని చెప్పవచ్చు.

పారిశుద్ధ్య కులానికి చెందిన స్త్రీలు నెత్తిమీద చేట, చేటలో ఉగ్రరూపంలో వున్న దేవతా విగ్రహాన్ని పెట్టుకొని ఊరేగింపుగా బయలుదేరతారు. ఆ కులంలో స్త్రీలు, పురుషులు చీపుళ్ళు పట్టుకొని వీధులు ఊడ్చుతూ అమ్మవారికి ముందు కదులుతారు. ప్రతి ఇంటి ముందు ఇల్లాళ్ళు బిందెలతో నీళ్ళు వారపోస్తారు. శీతాలదేవి విగ్రహం ముందుగల కుంకుమ తీసుకొని పిల్లలకు నొసటిన పెడతారు. అగ్రకులాల నుంచి అట్టడుగు కులాల వరకు అంతా పాల్గొనే కొలుపు అది.

గ్రామంలో పారిశుద్ధ్యం క్షీణిస్తే అంటువ్యాధులు ప్రబలుతాయన్నది వైజ్ఞానిక దృక్పథం అయితే, తనని ప్రజలు మరచిపోతే శీతలాదేవి పసిపిల్లలను మింగి వేస్తుందని కొందరి నమ్మకం. ఏమైనా పారిశుద్ధ్య కులానికి ఈ కొలుపుల సమయంలో ఎంతో గౌరవం లభిస్తుంది.

ఈ శీతలాదేవి రూపాన్ని వ్యాసమహర్షి కాశీఖండంలో ఇలా వర్ణించాడు. ఆ శ్లోకాన్ని ఇప్పటికీ కొన్ని వైదిక కుటుంబాల్లో చదువుకొంటారు.

**"నమామి శీతలాం దేవీం రాసభస్తాం దిగంబరాం**
**మార్జనీ కలశోపేతం శూర్పాలంకృత మస్తకాం**
**వందేహం శీతలాందేవీం సర్వరోగ భయాపహం"**

- ఇలా సుదీర్ఘంగా సాగే ఈ స్తోత్రం ప్రకారం శీతలాదేవి రూపం ఇలా ఉంటుంది.

నెత్తి మీద చేట, చేత చీపురు, నీళ్ళ చెంబు, దిగంబర రూపం, గాడిద వాహనం.

ఒకప్పుడు గాడిద రజకులకు మైల వస్త్రాలను మోసుకొని పోవడానికి ఉపయోగపడిన వాహనం. పూర్వం పారిశుద్ధ్య కులంవాళ్ళు కూడా గాడిదలను ఉపయోగించే వాళ్ళు.

మానవ మలాన్ని ఒకప్పుడు చేటలలో ఎత్తి తీసుకొనిపోయేవారు. ఈ కులవృత్తికి వ్యతిరేకంగా గాంధీజీ ఉద్యమమే నడిపారు. పైగా సెప్టిక్ లెట్రిన్లు రావడంతో ఈ నీచమైన వృత్తి అంతరించి పోయింది. వృత్తి రూపుమాసిపోవడంతో శీతలాదేవి కొలుపులు కనుమరుగయ్యాయి.

1848లో ఆనాటి బెజవాడలో ఆనకట్ట నిర్మాణం మొదలైనప్పుడు కలరా విపరీతంగా వ్యాపించింది. వందల సంఖ్యలో జనం మరణించారు. ప్రభుత్వం ఆపద్ధర్మ ఆస్పత్రులు నెలకొల్పింది. అప్పుడు ఏర్పడినదే విజయవాడ పాలప్రాజెక్టు సమీపంలోని కలరా ఆస్పత్రి. ఆస్పత్రులలో చికిత్సలతోపాటు ఊరూ వాడా శీతలాదేవి కొలుపులు జరిగాయి.

దాదాపు ఏడాది క్రితం వరకు విజయవాడ బ్రాహ్మణవీధిలో కన్యకాపరమేశ్వరి సత్రం సమీపంలో రోడ్డు ప్రక్కగా శీతలాదేవి గుడి ఉండేది. పేరు శీతలాదేవి. రూపం మాత్రం వ్యాసమహర్షి వర్ణించినది కాదు. రెండేళ్ళ క్రితం జరిగిన రోడ్డు విస్తరణలో ఆ గుడి ఎటు పోయిందో తెలియదు.

శీతలాదేవి విగ్రహం మాత్రం నెత్తి మీద మంటలు మండుతున్నట్లు ఉంటుంది. అగ్నిహోత్రం సర్వమలాపహరం కదా! ఒక చేతిలో చీపురు, మరో చేతిలో కలశం గల స్త్రీమూర్తి పారిశుద్ధ్య కులానికి అధిష్ఠాన దేవత ప్రజారోగ్య పరిరక్షణ దేవత. బాల రోగాలను అదుపుచేసే అమ్మవారు. వైదికులు బాలరిష్టాలను పరిహరించే దేవతగా భావించే ఈ అమ్మవారి గుడి విజయవాడలో ఉండేది.

శీతలాదేవి పారిశుద్ధ్య కులంవారి కులదేవత ఎలా అయిందోగాని మన గ్రామ నిర్మాణ సంప్రదాయంలో ఆ దేవికి ప్రత్యేకత ఉన్నది. గ్రామ నిర్మాణానికి ముందు బొడ్డురాయిని నెలకొల్పుతారు. ఆ రాయి క్రింద శీతలా యంత్రం ప్రతిష్టిస్తారు. అంటే యంత్ర ప్రతిష్ట తరువాత బొడ్డురాయిని నెలకొల్పుతారన్నమాట. ఆ రాయికి ఎనిమిది దిక్కులలోను ఊరి పొలిమేరలను నిర్ధారించే దిక్కురాళ్ళు పాతుతారు. ఈ శీతలా యంత్ర బలం వల్ల దిక్కురాళ్ళ పరిధిలోని గ్రామానికి ఎలాంటి అరిష్టాలు వాటిల్లజాలవని

అంటారు. మరొక విశేషమేమంటే శీతలాయంత్రాన్ని కొందరు ఇళ్ళలో కూడా పెట్టుకొంటారు.

## రాట్నాలమ్మ తల్లి

సమాజం స్తబ్దంగా ఉండదనీ, నిరంతరం ఏవేవో మార్పులను ఆహ్వానిస్తుందనీ, కులాల అనులోమ విలోమాలు సహజంగానే ఏర్పడతాయని సామాజిక శాస్త్రవేత్తలు అంటారు. ఈ పరిణామాలనే సామాజిక చలనం అంటారు. అగ్రకులాల ప్రాధాన్యం తగ్గి అట్టడుగు వర్గాలు పైకి రావచ్చు. మళ్లీ ఆ కులాలు, వర్గాలు క్రిందకు రావచ్చు. ఈ విధంగానే కులదేవతలు, కుటుంబ దేవతలు కూడా ఊర్ధ్వచలనానికో లేదా అధోచలనానికో లోనవుతాయి.

ఈ పరిణామ క్రమంలో వైదిక దేవతలు గ్రామదేవతలవుతారు. ఆ గ్రామవాసులు మరో ప్రాంతానికి వలస వెళ్ళినప్పుడు తమతో ఆ దేవతలను కూడా తీసుకొని పోతారు. అలాంటి సంచార దేవతలకు కొన్ని చోట్ల స్థిరనివాసం ఉండవచ్చు. లేదా తిరుగుతూ వుంటారు. ఈ తిరిగే దేవతలను అవసర దేవతలు అంటారు. ఈ అవసర దేవతలే సంచార దేవతలు. వైదిక దేవతలను ఆరాధించడానికి ముందు ఈ సంచార దేవతలను కొలవాలి.

విజయవాడలో మొన్నటి పుష్కరాల కాలంలో రాట్నాలమ్మతల్లి ఈ నగరానికి వచ్చింది. గట్టు వెనుక గంగానమ్మతల్లి గుడివద్ద నాలుగు రోజులు కొలుపులు జరిగాయి. మళ్ళీ కనిపించలేదు మనుషులు తమ అవసరాలకోసం తెచ్చుకొనే ఈ దేవతల వెనుక చక్కని చరిత్ర ఉంటుంది.

గుంటూరు జిల్లా దూపాడు (పల్నాడు) ప్రాంతంలో పూర్వం ప్రత్తి బాగా పండేది. ఈస్టిండియా కంపెనీ తన వ్యాపార అవసరాలకు పత్తి పంటను ప్రోత్సహించేది. అనుబంధంగా నూలు వడికే వృత్తి ఏర్పడింది. ఈ నూలును కంపెనీ కొనుగోలు చేసేది. జరిగే మోసం అంతా ఇక్కడే జరిగేది. నాణ్యత బాగాలేదని పనివారిని కంపెనీ ఏడిపించేది. శ్రమకు తగ్గ ప్రతిఫలం రాకపోయే సరికి గ్రామీణ కుటుంబాల్లో అసహనం పెరిగి పోయింది. అయితే అది తిరుగుబాటు రూపం పొందకముందు జరిగిన విచిత్ర సంఘటన.

దూపాడు గ్రామంలో నూలు వడికే కుటుంబాలు చాలా వుండేవి. ఒక ఇంట్లో ఇల్లాలుకు ఒకసారి భీభత్సం ఎదురైంది. నూలు కొనుగోలు చేసే పర్చేజ్ గుమాస్తా (తెల్లదొర) కళ్లు ఆ ఇల్లాలి మీద పడ్డాయి. అందమైన ఆ యువతిని ఒక రోజు బలాత్కరించబోయాడు. ఆమె కోపంతో మండిపడింది. పెనుగులాటలో తన ఇంట్లోవున్న రాట్నాన్ని (పెద్ద చక్రం గలది) ఆయుధంగా చేసుకొని ఆ తెల్లదొరను చితక బాదింది. వాడు చచ్చాడు.

'హత్య'కు కారణం 'మొలెస్టేషన్' అయినా కంపెనీ ప్రభుత్వం దానిని దాచిపెట్టింది. పోలీసులు వచ్చి ఆ ఇల్లాలిని ఆ ఇంట్లోనే చితకబాది చంపేసి ఇంటిని తగల బెట్టారు. అడ్డం వచ్చిన గ్రామస్థులను విచక్షణ లేకుండా కొట్టారు.

పోలీసుల అకృత్యం ఆరని చిచ్చు అయింది. ఆ రోజుల్లో దోపిడీ దొంగలు విచ్చల విడిగా దోచుకోనేవారు. దొంగలకు దూపాడు ప్రజలు ఆశ్రయమిస్తున్నారనీ, వాళ్ళ నుంచి సొమ్ములో వాటా తీసుకొంటున్నారన్న అభియోగంతో దొంగలను మించిపోయి పోలీసులు హింసాకాండ కొనసాగించారు.

రాట్నాన్ని ఆయుధంగా తీసుకొని తన శీలాన్ని కాపాడుకొన్న ఆనాటి మానవతి ఆ గ్రామవాసులకు ఆరాధనీయురాలైంది. రాట్నాలమ్మ అయింది. ఎప్పుడో 1838లో జరిగిన ఈ సంఘటన గుంటూరు జిల్లా రికార్డ్స్ వాల్యూమ్ 14లో నమోదు అయింది. అనంతర కాలంలో (1845) జిల్లా పరిపాలన మీద విచారణ జరిపిన వాల్టర్ ఇలియట్స్ ఈ విషయమై మరికొంత సమాచారం నమోదు చేశాడు.

అప్పటికే అనవహనం ప్రజల్లో పెరిగి తిరుగుబాటుకు సమాయత్తమవుతున్న ప్రజలకు విచారణ విశేషాలు తెలియకుండా పోయాయి. ఆ నివేదికలు ఇప్పుడు లండన్ ఇండియా లైబ్రరీ 'క్లాసిఫైడ్' శ్రేణిలో చేరినాయి. అలా చేరిన నివేదికల్లో 'పోలీసు టార్చర్స్'కు సంబంధించినవి కూడా ఉన్నాయి.

ఈ రాట్నాలమ్మ గురించిన వాస్తవాలు అటు జిల్లా రికార్డుల్లో మరుగు పడగా, వాల్టర్ కమిషన్‌లో కొన్ని వెలుగులోకి వచ్చాయి. టార్చర్ కమిషన్‌లో పూర్తిగా బయటపడ్డాయి. కానీ, అవేవీ జనానికి అందుబాటులో లేకుండా పోయాయి. మనకు వాస్తవాలతో పాటు కథలు మిగిలాయి. అలాంటి వాటిలో రాట్నాలమ్మ తల్లి కథ ఒకటి. చివరకు ఆమె సంచార దేవతగా, అవసర దేవతగా మిగిలింది.

## వీరబాబు గుడి

వైదిక దేవతలు కుల దేవతలుగా, కులదేవతలు కుటుంబ దేవతలుగా మారిపోయారు. మార్చివేసేది మనమే! ఇది అనాదిగా వస్తున్న సంప్రదాయం. అలా వస్తున్న సంప్రదాయంలో ఒకటి విజయవాడలో కళాక్షేత్రం వెనుక వెలసినదే వీరబాబు గుడి.

కుటుంబంలో అందరి ప్రేమాదరాలు పొందిన వ్యక్తి బలవన్మరణానికో, అకాల మృత్యువు వాతపడినప్పుడో ఈ వ్యక్తిని ఆ కుటుంబం దేవతగా భావించి పూజలు చేయడం నేటికీ కనిపిస్తుంది. అట్టడుగు కులాల్లో వీరుళ్ళకు పెట్టడం అనీ అగ్రకులాల్లో కుటుంబాలకు పెట్టడం అని అంటారు. చనిపోయిన వ్యక్తి స్త్రీ అయితే ముత్తయిదువకు పెట్టడం అనీ, పురుషుడైతే కుటుంబం అని అంటారు. పెళ్ళిళ్ళ టైములో చనిపోయిన ఆ ఇంటి ముత్తయిదువను తల్చుకొని ఎవరైనా ముత్తయిదువకు చీర, సారె పెడతారు. అలాగే మరణించిన వ్యక్తి వితంతువు అయితే వితంతువుకు బట్టలు, విభూతి ఇచ్చే ఆచారం అగ్రకులాల్లో వుంది. అదే విధంగా చిన్న పిల్లలు మరణిస్తే ఇతరుల పిల్లలకు బట్టలు పెట్టడం కూడా ఉంది. ఇదంతా మనకు అనాదిగా వస్తున్న ప్రేతాత్మ ఆరాధన లేదా వీరారాధనలో భాగమే. మనం పెట్టే తద్దినాలు కూడా అలాంటవే! అయితే అవి కుటుంబానికి మాత్రమే పరిమితం. కుటుంబంలో మరణించిన వ్యక్తి ప్రముఖుడైతే వర్ధంతులు జరపడం, ఫోటోలకు పూలదండలు వెయ్యడం, అక్కడ దీపారాధన చెయ్యడం కూడా వీరారాధనకు ఆధునిక రూపం. బాగా ఉన్నవాళ్లు అయితే గుడులు కూడా కడతారు. అలా వచ్చినదే విజయవాడలో వీరబాబు గుడి.

ఈ వీరబాబు గుడికి సంబంధించిన ఆసక్తికరమైన నేపథ్యం వుంది.

విజయవాడలో సామారంగంచౌకు తెలియనివాళ్ళు ఉండరు. ఆ వీధి 'సామ' ఇంటిపేరు గల వెంకటరంగం పేరుతో ఏర్పడింది.

సామ వెంకట రంగంగారంటే 1910-21 మధ్య కాలంలో ఆనాటి బెజవాడలో పేరున్న వైశ్య ప్రముఖుడు, సంపన్నుడు. ఆయన కుటుంబంలోనో, ఆ వంశంలోనో జరిగిన కథ ఇది. ఆ ప్రముఖుడికి లేకలేక ఒక మగపిల్లవాడు కలిగాడు. అల్లారు ముద్దుగా పెరుగుతున్నాడు. అతడి నాల్గవ పుట్టిన రోజు వచ్చింది. ఆరోజు ఆ పిల్లవాడిని చక్కగా అలంకరించారు. నిలువెల్లా బంగారంతో ముస్తాబు చేశారు. ఈ సాయంత్రం పేరంటం చేశారు. రాత్రి అయింది. అకస్మాత్తుగా పిల్లవాడు మాయమయ్యాడు. ఇక భయాందోళనలు ఆ కుటుంబంలో ఎంత ఉద్రిక్త వాతావరణం సృష్టించాయో ఊహించవచ్చు.

ఆ రాత్రికి రాత్రి మనుషులను పెట్టి ఊరంతా వెతికించారు. పిల్లవాడి జాడ తెలియలేదు. ఆ రాత్రంతా ఆ ఇంట్లో విషాదం తాండవించింది.

బెజవాడ సబ్ జడ్జీ ఛార్లెస్ విలియమ్స్‌కు ఆ రాత్రి ఒక స్వప్నం వచ్చింది. ఆ కలలో ఒక పిల్లవాడు కనిపించి ఫలానా ఆడమనిషి తన నోట్లో గుడ్డలు కుక్కి పీక పిసికి చంపేసిందనీ, తన వంటి మీద బంగారం అంతా మరో స్త్రీ సాయంతో ఒలిచివేసి తనను పాతిపెట్టిందని ఏడుస్తూ చెప్పాడట. మరునాటి ఉదయం విలియమ్స్ దొర పోలీసులను పిలిపించి తన స్వప్న వృత్తాంతం చెప్పాడు. అప్పటికే కిడ్నాప్ కేసు రిజిస్టర్ చేసుకొన్న పోలీసులు ఆశ్చర్యపోయారు. దొరగారి ఫిర్యాదును కూడా 'రిజిస్టర్' చేసుకొన్నారు.

షావుకారుగారి ఇంట్లో అనుమానించతగిన వ్యక్తుల్లో ఇంటి పనిమనిషి కూడా ఉంది. ఆమెను జడ్జిగారి ముందు హాజరు పర్చారు.

విచిత్రమేమంటే జడ్జిగారికి కలలో కనిపించిన మనిషి ఆ మనిషే! ఆయన ఆ విషయం ధ్రువపర్చగానే పోలీసులు కస్టడీలోకి తీసుకొని 'ప్రశ్నించారు. పోలీసు భాషలో ప్రశ్నించడమంటే నాలుగు తగిలించడం కదా! ఆ నాలుగూ తిన్న తరువాత ఆమె అసలు నిజం కక్కేసింది.

ఆ రాత్రి అందరూ పేరంటం హడావుడిలో వుంటే పిల్లవాడిని దగ్గరకు రమ్మని సైగ చేసింది. అలవాటైన ఆయమ్మ పిలవగానే అభం శుభం తెలియని ఆ అబ్బాయి వెళ్ళాడు. ఆ ఇంటి పెరడులో అతడి నోట్లో గుడ్డలు కుక్కి గోడ అవతల తన కోసం పడిగాపులు కాస్తున్న మరో ఆడమనిషికి అప్పగించి చక్కగా పనిపాటలో నిమగ్నమైంది. పిల్లవాడు కనపడకపోయేసరికి అమాయకత్వం నటిస్తూ తెచ్చి పెట్టుకొన్న భయాందోళనలతో అందరితో పాటు అన్ని చోట్లు వెతికింది. తెలివిగా పిల్లవాడిని పాతిపెట్టిన ప్రదేశానికి మాత్రం తీసుకొని పోలేదు.

ఆభరణాలు ఆ ఇద్దరి నుంచి స్వాధీనం చేసుకొన్నారు. శిక్ష పడిందో లేదో కథాంతరం. ఆనాటి నుంచి అల్లారుముద్దు బాబు ఆ కుటుంబానికి వీరబాబు అయ్యాడు. అతడి పేరుతో గుడికట్టించి 'వీరబాబు గుడి' అని పేరుపెట్టారు.

పిల్లలకు నున్స్తీ చేసినపుడు వీరబాబుకు మొక్కుకొంటే నయమవుతుందని ప్రచారం!

## దేశమ్మవారి (మరిడమ్మ) దండకం

కృష్ణా జిల్లాలో పురుషులకు మరిడయ్య, స్త్రీలకు మరిడమ్మ పేర్లు చాలా కన్పిస్తాయి. ఈ పేర్లు గ్రామ దేవత మరిడమ్మ పేరు నుంచి జనించినవే! కొంతకాలం క్రితం వరకూ కృష్ణాజిల్లా కైకలూరుకు మరిడమ్మ గ్రామదేవతగా వుండేది. ఏ కారణం వల్లనో 1920 తర్వాత ఆ గ్రామ దేవత అదృశ్యమైపోయింది. మరాటీ దండు పోటెత్తినప్పుడు వారి ద్వారా సంక్రమించిన అంటు వ్యాధులకు భయపడిన తెలుగువారు ఆ వ్యాధులకు అధిష్టానమైన దేవతకు మరిడమ్మ అని పేరు పెట్టి ఉండవచ్చునని పరిశోధకులు అభిప్రాయ పడుతున్నారు.

మరిడమ్మను 'మరిడీ మహాలక్ష్మి' అని కూడా అంటారు. అలా అనడానికి కారణం పూర్వం మరాటా సైన్యం ఆంధ్రదేశంపై దాడిచేసినప్పుడు వారి వల్ల వ్యాపించిన వ్యాధిని మరిడీ అని లేదా కలరా అనిగాని అన్నారు.

కలరా వ్యాధి అధిదేవతను గురించిన దండకం ఒకటి మద్రాసు లైబ్రరీలో వుంది. 1986వ నంబరుతో గల ఈ గ్రంథాన్ని కోదండరామ కవి వ్రాశారు. కలరా వ్యాధి గ్రామంలో వ్యాపించినప్పుడు ఈ దండకాన్ని చదువుతారని ఆ గ్రంథానికి వ్రాసిన వ్యాఖ్యానంలో వుంది.

దేశాంతరం నుంచి వచ్చి వ్యాపించిన వ్యాధి కనుక మరిడీ దేవతకు దేశమ్మవారు అన్న పేరు ఏర్పడిందట.

దండకం ఇలా ప్రారంభమౌతుంది.

"శ్రీ మన్మహారౌద్ర వక్త్రీ సురజ్యేష్ఠ పుత్రీ సువిద్యుల్లతా దీపగాత్రీ సురస్తోత్ర పాత్ర జగద్వాపకీ తాపకృత్యాయకీ చండికా నాయకీ ఆదిశక్తీ పరంజ్యోతి జ్యోతిర్మయీ భద్రకాళీ పరాశక్తి పాపహరీ త్రిలోక ప్రచారీ మహామాయి మరిడీ భ్రమణనీ జగద్రక్షణీ...

అలా సాగే స్తోత్రంలో వర్ణవ్యత్యాసాలు లేకుండా అంతా అమ్మవారిని కొలిచేవారనడానికి ఫలశ్రుతి వాక్యమే ప్రమాణం.

"బ్రాహ్మణ క్షత్రియ వ్రాతమున్ వైద్య శూద్రాణి నానా జనానీకమున్ బ్రోచి రక్షించవె తల్లి బంగారు బొమ్మా మహాశక్తివమ్మా కటాక్షించవమ్మా జగన్మాతవమ్మా మహాదుర్గి మహాలక్ష్మి కోదండ రామాభిదాసుండు పూదండగా దండకం బొక్కటిన్ చెప్పి నీకర్పితం బొప్పగావించెదన్ దండకం బెవ్వరైనన్ పఠింపన్ విన్నన్ వ్రాసినన్ వారికవ్వారిగా కోర్కులిప్పించి రక్షింపవమ్మా జగద్రక్షణీ లోకమాతా సమస్తే సమస్తే నమః

ఈ దండకంలో మత్తేభవిక్రీడిత వృత్తంలో ఒక మంచి పద్యం కూడా వుంది.

"హరియైనన్ హరుడైన నింద్రుడైనన్ అబ్జాసనుండైన ని
న్నెరుగన్ జాలరు నీ మహిమ మాకెన్నంగ శక్యంబయో
పరదేవీ విషజాత మారుత మరుత్పాశాబ్జ పాణిద్వయీ
మరిడీ దేవత మమ్ము బ్రోవగదవమ్మ లోకరక్షామణీ!

ఇది సుప్రసిద్ధ కవి, పండితుడు, చరిత్ర పరిశోధకుడు వేటూరి ప్రభాకర శాస్త్రిగారు సేకరించిన మరిడీ దేవత అనే చాటువు.

## పలువురు గ్రామ దేవతలు

మద్రాసు ప్రాచీన గ్రంథ భాండాగారంలో 19వ శతాబ్దంలో తెలుగునాట బహుళ ప్రచారంలో వున్న గ్రామ దేవతలకు సంబంధించిన స్తోత్రాలు, స్తవాలు, దండకాలు అనేకం వున్నాయి. 1981వ నంబరు గల గ్రంథంలో ఒక గ్రామ దేవత దండకం ఉన్నది. నిజానికి ఇది ఒక్క గ్రామ దేవతకు చెందినది కాదు. కొల్లాపురీయమ్మ, అద్దంకి మహలక్ష్మమ్మ, కొల్లేటి పెద్దింటమ్మ, నాగపల్లి పళ్ళాలమ్మ, రేలంగి మెంట్లమ్మ, రాకుదిటి మామిళ్ళమ్మ, మోగంటి పెన్నేరమ్మ మొదలైన గ్రామ దేవతలు ఇందులో కనిపిస్తారు. ఇలాంటి దేవతలకు చెందినదే ఆ దండకం.

సంక్రమణ వ్యాధులు గ్రామంలో వ్యాపించినప్పుడు శాంతి చేకూర్చే గ్రామ దేవతల కొలుపును ప్రశంసించే దండకమిది:

“బాకా బజంత్రీలు భాకాలు కొమ్ముల్ మహావాద్యముల్
సేయగా పంబజోళ్ళందు జేగంట చైనీలు మాష్టీలు
గొసంగులున్... యంగణాచార్లు నిన్నాడగా
నంత ఆగంబు గావించి తీర్థంబులున్ జేసినన్
వారినిన్ మెత్తువే వేడ్క వారంబులున్నిత్తువే
కల్గి యుగంబునన్....

అన్న స్తోత్రం ఇలా ముగుస్తుంది.

“దేవి రక్షింపవే నీకు బొంగళ్ళు బోనాలు వేయించి
యాయాటలం గొళ్ళునుంగొట్టి నైవేద్య
ధూపంబులున్నిచ్చి నిత్యోత్సవంబుల్ సదా
నెప్పుడున్ గావించి సేవింతురే యమ్మ భావింతురే
నేను నీ దాసదాసాది దాసుండనై మ్రొక్కెదన్
ఏలవమ్మా శివా భవానీ కటాక్షింపు... నమస్తే నమస్తే నమః

వాస్తవానికి గ్రామ దేవతల కొలువులన్నీ కుడిఎడమగా ఒకే విధంగా ఉంటాయి. కనుక దండకాలు కూడా కాస్తంత తేడాతో ఒకే తీరులో

ఉంటాయి. అందులో ఈ దండకం చాలా మంది గ్రామ దేవతలకు 'కామన్' స్తోత్రంగా కనిపిస్తున్నది.

## అనుబంధం

## కొందరు కులదేవతలు

### భావనా రుషి మహత్యము

మానేపల్లి (మానవల్లికాదు) మానవల్లి కాదు ఈయన పేరు రామచంద్ర కవిగారు 1920లో ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్ లైబ్రరీకి అందజేసిన ఒక తాళపత్ర గ్రంథంలో కొంతభాగం (భావనారుషి మహత్యం) ఇది పద్మశాలీ కుల ప్రశస్తిని చెప్పే గ్రంథం- సంస్కృత మార్కండేయ పురాణంలోని భావనారుషి మహత్య భాగాన్ని అపస్తంబ సూత్రుడు శాండిల్యగోత్ర పవిత్రుడు వీరభద్ర మంత్రి పుత్రుడు వీరనామాత్యుడు తెలుగుచేసిన పద్యకావ్యం ఇది. కొన్ని పద్యాలు ఇవి.

శ్రీవాణీ గిరిజాధినాధులును సజ్జీమూత గాంగేయతా
రావర్ణుల్ పరితోషిత తుష్టి లయ కర్తల్ తార్క్ష్యకాదంబరా
డ్గోవాజుల్ మధుకైట భృగపురభంగుల్ శైరులే వేదాద్వరే
ఖావాహుల్ హరిపద్మజేశ్వరులు వేడ్కన్ బ్రోతురాత్మస్థితిన్.

శాండిల్య గోత్ర సంజాతుడాపస్తంబ
సూత్రుండు పరమ పవిత్రుడవని
పోచి రాజాన్వయోద్భూతుండు భద్రమం
త్రీశుడాతని పత్ని యెల్లమాంబ
యా దంపతులకు వీరాహ్వాయుండుదయించె
నమ్మేటి సతికొండమాంబ యలరె
వారికిర్వురు సుతుల్ వీరభద్రనభద్ర
నాఖ్యులు గల్గి రందగ్రజుండు
వీరభద్రుండు తన భార్య విమలచర్య

మూర్తిమాంబ గుణాలంబ ముదమునొందె
నమ్మహాత్ములకేను నుద్భవము జెంది
యేదనర్చిత తీరకవీంద్రుడనగ

-అంటూ తన ప్రవర చెప్పుకొన్న కవి ఒక సీసపద్యపుటెత్తుగీతిలో

పద్మశాల్పట్టు శాల్పద్యంఖులందు
చెలగుదురు దీని మూలంబు జేయువాడు
భావనాముని తత్కులవంశమగును
తన్మహత్వంబు పరమమై ధరను వెలయు

- అని ముగించిన ఆ కావ్యం పద్మశాలీయ కులప్రశస్తి కావ్యమేననాలి

## దేవాంగరుషి దండకం

కులదేవతలకు సంబంధించిన దండకాలలో దేవాంగుల కులానికి చెందిన దేవాంగ రుషి కథను ఎవరో కవి ఏనాడో వ్రాసిన గ్రంథ ప్రతి ఒకటి 198వ నంబరుతో ప్రాచీన లిఖిత భండాగారంలో వుంది.

నారదుడు ప్రార్థించగా శివుడు తన దివ్యాంగం నుంచి దేవాంగుడనే రుషిని సృష్టించాడు. అప్పటి నుంచి దేవమానవులకు అవసరమైన వస్త్రాలకు అవసరమయ్యే సూత్రాలకు సంబంధించిన సూత్రాలను రూపొందించాడు. దేవాంగ రుషి విష్ణునాభి సరోజం నుంచి దారాలు తీసి వస్త్ర నిర్మాణం ప్రారంభించారు. రాక్షసుల నుంచి అవరోధాలు ఏర్పడకుండా వుండాలంటే దేవీ అనుగ్రహంవుండాలని భావించి ఒక దండకం ప్రారంభించాడట.

"శ్రీశంభురాణి స్ఫురన్నీల వేణీ పరంజ్యోతి రూపీ
మీ దివ్యపాదారవిందంబు లందంబుగా నా మనంబందు
సద్భక్తితో యుక్తితో నిల్పి మైచిత్రమై యొప్పుమీ చారు
చారిత్రముల్ దంకారూఢిగా జేసి యర్పించెదన్
సావధానంబుతో చిత్తరింపందగున్ దేవి
పూర్వంబునన్ సర్వ గీర్వాణులన్..."

"దేవాంగ మౌనీంద్ర చంద్రుండు నేర్పొప్ప నానా విధానేక
వస్త్రంబున్ వేడ్క నిర్మించి యాశీలికిన్ వేగ శుండాల
చర్మండు వస్త్రంబునన్ శిరికిన్ హేమవర్ణాఖ్యు
వస్త్రంబులున్ ధాతకున్ భీతితో హంసావళీ
నామధేయంబునన్ బ్రాకటంబైన వస్త్రంబు
నేకున్ నవీనంపు జీనాంభరముల్ మరిన్
లక్ష్మికిన్ శ్రీ విలాసంబునే వస్త్రముల్ భారతీ
దేవికిన్ ధౌత వస్త్రంబునన్ వాసిగానిచ్చి-" అంటూ ముగుస్తుంది.

దేవాంగ రుషి కథ ఒక త్యాగ నిరతికి సందేశం. ఆ త్యాగాన్ని మరువలేని ఆ కులీనులు దేవాంగ రుషిని ప్రత్యక్ష దైవంగా భావిస్తున్నారు.

## కన్యకాపరమేశ్వరి మరో కథ

కన్యకాపరమేశ్వరి వైశ్యుల కులదేవతగా భారతదేశంలో ప్రసిద్ధ దేవత. పార్వతిదేవి అవతారంగా వైశ్యులు భక్తి శ్రద్ధలతో కొలుస్తారు.

ఒకసారి వైశ్యులకు మ్లేచ్ఛులకు జరిగిన వివాదంలో పార్వతిదేవి వైశ్యుల పక్షాన నిలిచింది. వారి కాలంలో జన్మించడం ద్వారా వైశ్యుల్ని అధికులుగా చేసింది. మ్లేచ్ఛులు తమ పిల్లవాడికి పార్వతీదేవిని ఇమ్మని అడిగారు. వైశ్యులు నిరాకరించారు. రెండు జాతుల మధ్య తీవ్రమైన యుద్ధం జరిగింది. పార్వతిదేవి తన కారణంగా జననష్టం జరగడం ఇష్టంలేక, అగ్నిప్రవేశం చేసి తన అసలు స్వరూపాన్ని వైశ్యులకు ప్రదర్శించింది. వైశ్య జాతి క్షేమం కోసం తనను ఎప్పుడూ పూజిస్తూ వుండవలసిందిగా ఆమె ఆదేశించిందనీ, అప్పటి నుంచీ, కన్యకాపరమేశ్వరి పేరుతో ఆమెను తమ కులదేవతగా వైశ్యులు ఆరాధిస్తున్నారని ఈ కథ చెప్తోంది.

వైశ్యులు ఎట్టి పరిస్థితుల్లోనూ కులాంతర వివాహాలకు అంగీకరించరాదన్నది వారి ప్రతిజ్ఞ. వైశ్యుల ఈ కులాచారానికి భిన్నంగా ఒక రాజు వైశ్య కన్యక వాసవాంబను కోరి దుర్మరణంచెందాడు. రాజు బారి నించి తనను రక్షించుకోవడానికి వాసవాంబ తనను అగ్నికి ఆహుతి

చేసుకొంది.

కులాచారాన్ని సంరక్షించి కుల ప్రతిష్ఠని కాపాడిన వాసవాంబ వైశ్య కులదేవతగా నిలిచింది. ఆమెకు అండగా వుండి ఆమెతో పాటు మరణించిన వైశ్యులకు మోక్షం ప్రసాదించింది.

## నమస్తుభ్యం... నమస్తుభ్యం...

కృష్ణా జిల్లా గ్రామదేవతలలో కొందరి సమాచారమే లభ్యమైంది. పరిమితులకు లోబడి అందినంతవరకూ ఇచ్చిన సమాచారమేగాని ఇది సంపూర్ణంకాదు. వీలువెంబడి ఇంకా సమాచారం సేకరించి పునర్ముద్రణలో అందించగలం.

దిక్కులేని వాళ్ళకు దేవుడే దిక్కు, గ్రామాల్ని రక్షించేవాళ్ళు ఎవరైనా కానీండి.... వాళ్ళు దేవతలే! వాళ్ళనే గ్రామదేవతలు అనుకొంటారు.

గ్రామదేవతలకు అనుగ్రహం కలిగితే, పశుసంపద, జలసంపద, ధాన్యసంపదలు సమృద్ధిగా ఉంటాయి. జనం ఆరోగ్యంగా వుంటారు. పల్లెలు పచ్చగా కళకళలాడుతుంటాయి. ఆగ్రహం కలిగితే, అతివృష్టి, అనావృష్టి, అనారోగ్యం అశాంతి, ఆకస్మిక మరణాలు. ఇంకా ఎన్నో అనర్థాలు జరిగిపోతుంటాయి.

తమని కాపాడే శక్తి ప్రభుత్వానికి గానీ, ప్రభుత్వ యంత్రాంగానికి గానీ లేదనుకున్నప్పుడు గ్రామదేవతల్ని నమ్ముకోవడం ఒక అవసరంగా భావించుకుంటారు. తమ దేవత ఆగ్రహం చల్లార్చాలి. ఆమె అనుగ్రహం కోసం బలులిచ్చుకోవాలి. నైవేద్యాలు పెట్టుకోవాలి. పండుగలు, ఉత్సవాలు, జాతరలు, తిరునాళ్ళు జరుపుకోవాలి. ఇది గ్రామీణుల విశ్వాసం.

అసలు ఈ సామాజిక వ్యవస్థను కాపాడేది ఎవరు? అధికారులా లేక కోర్టులా, ప్రభుత్వమా. పట్టణాలకే పరిమితమైపోయిన ఈ అధికార యంత్రాంగం పనిచేస్తున్నప్పుడు గ్రామాలు దిక్కులేనివైపోతాయి. అయినా బ్రతుకుతున్నారు. ప్రమాదాలు ఎదుర్కొంటున్నారు. తమను కాపాడుతున్నది గ్రామ దేవతలేనన్న ధైర్యంతో బ్రతుకుతున్నారు.

మరి ఈ గ్రామదేవతల సంప్రదాయాన్ని ఈసడించి విమర్శించే నైతిక హక్కు ఎవరికి ఉన్నది? పండితమ్మన్యులు, మేథావులు ఆలోచించవలసిన అంశమిది.

గ్రామీణ వ్యవస్థలో గ్రామదేవత ఒక ప్రధాన అంశం. తోడూ నీడా అన్నీ ఆమే వాళ్ళకి! వారికేకాదు విశ్వాసం ఉన్నవారందరికీ కూడా. మన గ్రామీణ వ్యవస్థను, సంస్కృతిని అందరూ కాపాడుకోవాలని, ప్రజలంతా ఆరోగ్య భాగ్యాలతో తులతూగాలని ఆశిస్తున్నాం... మ్రొక్కిన వరములిచ్చే వేల్పులను ప్రార్థిస్తున్నాం. ఆ అనుగ్రహం కలుగుతుందనే శుభకామనతో అందరికీ నమస్తుభ్యం... నమస్తుభ్యం.





**శ్రీ పోతురాజు స్వామివారు**
నాగాయలంక



**శ్రీ కనకదుర్గమ్మ వారు**
విజయవాడ

# కృతజ్ఞతలు

అడ్వర్‌టైజ్‌మెంట్ ఇచ్చిన

**శ్రీ దుర్గామల్లేశ్వరస్వామివార్ల దేవస్థానం ట్రస్ట్‌బోర్డు**

విషయ సేకరణలలో సహకరించిన

శ్రీమతి ప్రశాంతి (విజయవాడ),

శ్రీ గుడిసేవ విష్ణుప్రసాద్ (అవనిగడ్డ),

శ్రీ తుర్లపాటి (అవనిగడ్డ),

శ్రీమతి భమిడిపాటి బాలా త్రిపురసుందరి (విజయవాడ)

పరిపరి విధాల సహకరించి మాకు శ్రమ తగ్గించిన

శ్రీ ఎమ్.సి.కె. రాజు,

చక్కగా టైప్‌సెట్టింగ్ చేసిన

శ్రీమతి జి. ఉషశ్రీ (యోగితాగ్రాఫిక్స్),

కవర్‌పేజి డిజైన్ చేసిన శ్రీ శ్రీనివాస్,

"ఆశీర్వాద శ్రీముఖము" పంపిన

**సిద్ధేశ్వరీ పీఠాధిపతి శ్రీ సిద్ధేశ్వరానంద భారతీస్వామి** (కుర్తాళం)
(పూర్వాశ్రమ నామధేయులు డాక్టర్ ప్రసాదరాయ కులపతి) గారికి-

కృతజ్ఞతలు

**కృష్ణాజిల్లా న్యూ మాన్యువల్ కమిటీ**



**శ్రీ అద్దంకి నాంచారమ్మ అమ్మవారు**
విశ్వనాథపల్లి



**శ్రీ కనకదుర్గమ్మ అమ్మవారు**
గణపేశ్వరం



**శ్రీ గంగానమ్మ అమ్మవారు**
కోడూరు



**శ్రీ లంకమ్మ అమ్మవారు**
అవనిగడ్డ

106

# KRISHNA DISTRICT NEW MANUAL COMMITTEE



Chairman, Krishna District New Manual Committee

Editor, Krishna District New Manual

**Sri K. Prabhakara Reddy,** IAS

Former District Collector, Krishna

Addl. Secretary, Chief Minister's Peshi, A.P.

**SRI SIRAM RAMA RAO**

**SRI E. GOPALA KRISHNA REDDY**

**SRI PARVATHANENI SHANTI KISHORE**

**SRI DASARI RAMAKRISHNA**

**SRI Ch. AJAY KUMAR**

**Dr. G.V. PURNACHAND**

**SRI IMMADISETTY RAMA KUMAR**

**SRI LANKA VENKATA RAMANA**

